

## శ్రీ సరస్వతీ ప్రార్థన.

క్షోణితలంబునన్ నుదురు సోకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైకవాణికిన్
వాణికి నక్షదామశుకవారిజపుస్తకరమ్యపాణికిన్.

నిన్నుఁ దలంచి పుస్తకము చేఁ బూనితిన్ నీవు నా
యున్నంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ పూర్ణేందుబింబాననా

## శ్రీమద్భాగవతగ్రంథప్రణేత యగు వ్యాసమహర్షి ప్రార్థన.

ప్రాంశుపయోదనీలతనుభాసితు సుజ్జ్వలదండధారుఁ బిం
గాంశుపటాచ్ఛటాభరణు నాగమపుంజపదార్థతత్త్వని
ర్మాంశముకాంతుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్త్వ భారతీ
వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్.

## శ్రీమద్భాగవతార్థోపదేష్ట యగు శుకమహర్షి ప్రార్థన.

మునుఁ దైవాయువిదుండు ముక్తమతుఁడై సన్న్యాసియై యొంటి పో
వ భువామేఘని నో పుత్రకుమార యనుచున్ వ్యాసుండు చీరంగ వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు సక్రమం జేసె మున్నట్టిభూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్

## శ్రీమద్భాగవతప్రార్థన.

వేదకల్పవృక్షవిగళితమై శుక, ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణఫలరసాస్వాదన, పదవిఁ గనుఁడు రసికభావవిదులు.

లలితస్కంధము గృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై.

నిగమములు వేయి చదివిన, సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్
సుగమంబు భాగవత మను, నిగమంబుఁ బఠింప ముక్తినివసనము బుధా.

ఆతిథి సర్వ[illegible] భాగవతంబు, [illegible] దెవ్వఁడేని మాపు రేపు
జాల భక్తితోడఁ జదువుఁ డా సంసార, దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవ

## శ్రీభాగవతగ్రంథప్రతిపాద్యశ్రీకృష్ణమూర్తిప్రార్థన.

మ. తరుణాబ్జారుణలోచనద్వయి కృపాధారేయమై యొప్ప సా
గరకన్యాకుచకుంభపాళిఁ బులకల్ గన్పట్టు మాసింద్రహృ
త్సరసీజంబులు సంచలింప మురళీసంజాతగీతామృత
స్ఫురణన్ రాల్ గరఁగం జరించుహరికై శోరంబు భావించెదన్.

చ. జలనిధికన్యకాఘనకుచస్థలిపచ్చలతాళి గోపికా
విలసితహారమధ్యమణి విశ్వజగద్వలయప్రకాశకో
జ్జ్వలమహనీయరత్న మనివారితకాళియభోగిభోగము
డలగిరివజ్రమై వెలయునందతనూజు భజింతు నామదిన్.

## గ్రంథనాయకుం డగుశ్రీరామమూర్తిప్రార్థన.

క. శ్రీకంఠచాపఖండన, పాకారిప్రముఖవినుతభండన విలస
త్కాకుత్స్థవంశమండన, రాకేందుయశోవిశాల రామనృపాలా.

## ఆంధ్రభాగవతరచనాక్రమము.

పైఁ దెలిపినపోతనామాత్యవిరచితం బగు నీయాంధ్రభాగవతంబు [illegible] గ్రంథసంఖ్య సమాకల్యంబుగా గణింప సరాసరి ముప్పదినాలుగువేలున్నది. [illegible] బునకు మూలభూతం బగుసంస్కృతభాగవతంబునం గలగ్రంథసంఖ్య [illegible] యిరువదిరెండువేలు. ఈమీఁదఁ జెప్పినక్రమమున మూలగ్రంథము సత్త్రి [illegible] గ్రంథసంఖ్య గలదిగా నీగ్రంథము రచియింపఁబడుటకుఁ గారణం బేయన్న [illegible] బ్రాహ్మాద్యష్టాదశపురాణంబులలో నుత్తమం బగునీపురాణం బత్యంత [illegible] ప్రతిపాదకంబును బరమవేదాంతప్రతిపాద్యభగవద్గుణగణప్రతిపాదకంబు [illegible] యుత్తమగ్రంథం బగుటఁబట్టి యిట్టిగూఢం బైనగ్రంథార్థంబు [illegible] వ్యాఖ్యానరూపముగా నభివర్ణించుట, భగవద్గుణవర్ణనాదిఘట్టంబులం [illegible] భాగవతప్రతిపాదితక్రమమున నభివర్ణించి స్వకీయభగవద్భక్త్యతిశయ [illegible] నవ్యకవిత్వవిద్యాచాతురీసంప్రాప్తనిరంకుశస్వాతంత్ర్యము సకలవిద్వజ్జనంబులకుం దెలుప భగవద్గుణాదులను విశేషముగా వర్ణించుట,* భాగవతగ్రంథప్రతిపాదితంబె కాక నిశిష్టశిష్టజనాంగీకార్యంబు లగువిష్ణుపురాణహరివంశాదిగ్రంథప్రతిపాదితంబు లగు కథావిశేషంబులం గొన్నిటిం దెలుపుట, యనునీహేతుత్రయంబువలనను నాంధ్రభాగవతంబునందు సరాసరి యష్టసహస్రగ్రంథసంఖ్య యధికంబై యున్నది. కాన సంరక్షితసకలార్థంబులు గలధనికునకు నధికార్థంబు చేకూడుటచే నతనిసంపద యతిశ్లాఘ్యంబుగా నుండురీతి సంస్కృతభాగవతగ్రంథప్రతిపాదితార్థావిరుద్ధభగవద్గుణవర్ణనాదులు గలయీగ్రంథం బతిపూజ్యంబుగా సకలవిద్వజ్జనంబులచే నంగీకరింపంబడఁదగినదిగా నున్నయది.

ఇదియునుం గాక భారత-రామాయణ-విష్ణుపురాణ-స్కాందాద్యుత్తమ గ్రంథంబులఁ దెనుంగున గద్యపద్యాత్మకంబులుగాఁ జేసి [illegible] యుభట్టారకాదు

* ఇందలి సత్యభామయుద్ధము మున్నగునవి కొన్ని సంస్కృతమునఁ గానరావు.

లయినను బహుళకవులు యీగ్రంథస్థితకథాంశానుక్రమణికమాత్రము వదలక తమకు దోఁచినట్లు గ్రంథరచన గావించినందున సపాదలక్షగ్రంథపరిమితంబగు మహాభారతం బాంధ్రంబున సుమారు పంచాశత్సహస్రసంఖ్యాకగ్రంథవిస్తృతంబై యున్నది. అట్లనే చతుర్వింశత్సహస్రగ్రంథపరిమితంబై షట్కాండములుగల శ్రీమద్రామాయణము తెనుఁగునందు ముందుచెప్పినచొప్పున భాస్కరకవి పంచసహస్రగ్రంథవిస్తృతంబుగా నొనర్చె ఇట్లు మూలగ్రంథార్థం బతిసంగ్రహంబు చేసి స్వేచ్ఛననుసరించి గ్రంథంబుల రచియించుటవలన వ్యాసవాల్మీక్యాదిమహర్షులయభిప్రాయంబు సమగ్రంబుగాఁ దెలుపఁబడక కేవలకథాంశానుక్రమవర్ణనపరంబులుగా నుండుటవలన ఋషిప్రోక్తసంస్కృతగ్రంథంబులవలె సత్యాదరణీయములుగా నేరవు కావునఁ బూర్వోక్తక్రమంబున నీభాగవతము వ్యాసప్రోక్తభాగవతగ్రంథార్థము నీషన్మాత్రం బయినం దారపాటు లేకయుండుటయకాక యాయాసందర్భములకుఁ దగినట్లు హరిగుణవర్ణనాధిక్యంబు గలిగియుండుటవలన సమగ్రభగవద్గుణప్రతిపాద గ్రంథ మగుచున్నది. కాబట్టి భగవద్వ్యాసప్రణీతభాగవతమువలెఁ బోతనామాత్య విరచితం బగు నీయాంధ్రభాగవతమును బఠియించునట్టి నిఖిలజనులకు నైహికాముష్మికఫలప్రదం బగు నని నిశ్చయింప నించుకయు సందియంబు పనిలేదు.

## శ్రీకృష్ణావతారకాలనిర్ణయవిచారఘట్టము.

శ్రీమదాశ్రితజనాపన్నివారణైకపరాయణుం డగు నాదినారాయణుండు భూభారాపహరణార్థంబు బ్రహ్మరుద్రేంద్రాదినిఖిలదేవగణంబులచే సంప్రార్థితుం డై శ్రీకృష్ణావతారంబు నొంది యఖిలదుష్టజననిబర్హణశిష్టజనపరిరక్షణాదికృత్యంబులు సలిపి యమానుషంబు లగువిచిత్రచరిత్రంబులచే నపరిమేయమహిమ నశేషభక్తజనాళికి దెలిపి మరల బ్రహ్మాదిదేవగణప్రార్థితుండై స్వధామం బగువైకుంఠధామంబునకరిగె నట్టి యపరిమేయానన్యాదృశానవద్యగుణగణప్రభావవినుతుం డగుభగవంతుని యవతారకాలనిర్ణయంబు సమ్యగనాతిరిక్తం బగునట్లు సాకల్యంబుగాఁ దెలిపెడ భాగవతవిష్ణుపురాణహరివంశాదిగ్రంథంబులలోఁ గొన్నిటియందు శ్రీకృష్ణావతారఘట్టంబునఁ దజ్జననక్షత్రమును దదావిర్భావప్రతిపాదకనిశీథకాలవిశేషమును మాత్రము దెలియుచున్నవి మఱికొన్ని గ్రంథంబులయందు మాస-ఋతు-పక్ష-నక్షత్ర-ముహూర్తములుమాత్రము దెలుపఁబడి యున్నవి గాని యట్టియభ్యుదయకాలంబు నిఖిలభక్తజనులత్యంతానందంబున నిదానించి తెలిసికొనుటకు నుపయుక్తం బగునట్లు యుగవర్షాదినిర్ణయం బాయవతారఘట్టంబున నింతోక్తిగా నెందును దెలుపఁబడలేదు. అయినను బఠితఘట్టంబులయందు నాయుగవర్షాదినిర్ణయంబు విద్వజ్జనైకవేద్యం బగునట్లు వివిధవచనంబులచే సూచితం బై యున్నది. అట్టిసూచితార్థం బఖిలభక్తజనగ్రాహ్యంబు గానిచో నెడల నాకృష్ణపరబ్రహ్మమూర్తి యేయుగంబున నేవర్షంబున నవతరించెననియు, అట్టికాలంబు గణింప నిప్పటికి గతసంవత్సరము లెన్ని యనియు; నమ్మహాత్ముండు భూలోకంబున లీలామానుషవిగ్రహంబు దీనవర్షంబు లెన్ని యనియుఁ, దెలియక భగవద్భక్తు లెల్లవారును సందిగ్ధ

మానసు లగుచున్నారు. కాబట్టి యట్టిసందేహనివృత్తి చేయుటచే నఖిలాస్మదీయ జనుల నుల్లసింపఁ జేయుదలంచి శ్రీకృష్ణావతారకాలనిర్ణయప్రతిపాదక గ్రంథంబులఁ దెలుపఁబడి యుండెడు ప్రమాణవచనాభిప్రాయములు బట్టి సర్వగ్రంథసామరస్యంబు గలుగునట్లు విశదముగా నీపిగువఁ దెలుపుచున్నాము.

—శ్రీకృష్ణావతారకాలనిర్ణాయకప్రమాణవచనార్థవిచారము.—

శ్రీమద్భాగవతమునందు దశమస్కంధంబునందలి తృతీయాధ్యాయమునందుఁ దెలుపఁబడి యుండెడు శ్రీకృష్ణమూర్త్యావిర్భావకాలప్రతిపాదక ప్రమాణవచనములు.

శ్లో. అథ సర్వగుణోపేతః కాలః పరమశోభనః, యర్హ్యేవాజనజన్మర్క్షం శాంతర్క్షగ్రహతారకమ్.
మందం మందం జలధరా జగర్జు రనుసాగరమ్, నిశీథే తమ ఉద్భూతే జాయమానే జనార్దనే.

ఈశ్లోకద్వయమునందుఁ బ్రథమశ్లోకంబున "అజనజన్మర్క్షమ్" అనుటచేత రోహిణీనక్షత్రమనియు, రెండవశ్లోకమున "నిశీథే తమ ఉద్భూతే" అనుటచేతఁ జీఁకటితోఁ జేరియుండెడు నిశీథకాలమనియుఁ దెలియఁబడుచున్నది. ఈమీఁదఁ జెప్పిన రోహిణీనక్షత్రనిశీథకాలంబులు గాక తక్కినయుగ వర్ష ఋతు మాస పక్ష తిథులు మొదలయినవి యేమియు నీభాగవతమునందు నారాయణావతారఘట్టంబునఁ దెలుపఁబడియుండలేదు.

హరివంశమునందుఁ బూర్వభాగములోఁ గలఁ [illegible] యధ్యాయమునందలి
ప్రమాణవచనములు

యోగమాయాం ప్రతి విష్ణూక్తిః.

శ్లో. తతోఽహం సంభవిష్యామి దేవకీజఠరే శుభే, [illegible] యశోదాయా గర్భస్య మవలంబితమ్. ప్రావృట్కాలే చ నభసి కృష్ణాష్టమ్యాం మహానిశి, ఉత్పత్స్యామి నవమ్యాం తు ప్రసూతిం త్వ మవాప్స్యసి.

ఈశ్లోకద్వయంబునందు "ప్రావృట్కాలే" అనుదానివలన వర్షర్తువనియు, "నభసి" అనుదానివలన శ్రావణమాసమనియు, "కృష్ణాష్టమ్యాం నిశి" అనుటవలనఁ గృష్ణపక్షాష్టమినాఁటిరాత్రి పూట యనియుఁ దెలియఁబడుచున్నది. మఱియు "నవమ్యాం చ ప్రసూతిం త్వ మవాప్స్యసి" అను వాక్యార్థమును విష్ణుపురాణహరివంశగ్రంథోదాహృతప్రమాణవచనస్థములగు "యామేవ రజనీ కృష్ణో జజ్ఞే వృష్ణికులే ప్రభుః, తామేవ రజనీం కన్యాం యశోదాదేవ్యజాయత" అనువచనార్థంబును సమరసపెట్టి యాలోచింపఁగా నవమీవిద్ధ గల యష్టమి శ్రీకృష్ణజననతిథి యని తెలియఁబడుచున్నది

తస్మిన్నే వాధ్యాయే—నిద్రాం ప్రతి శ్రీమన్నారాయణోక్తిః.

శ్లో. అర్ధరాత్రే కరిష్యామి గర్భమోక్షం యథాసుఖమ్, అష్టమస్యతు మాసస్య జాతా [illegible] స్తమః.
అహం యశోదాం యాస్యామి త్వం దేవీం యాహి దేవకీమ్, ఆవయోర్గర్భవ్యత్యయసేకం సోగచ్ఛతిమాధ [తామ్.

—3-అధ్యాయే.—

శ్లో. యస్మిన్నహని దేవేశం గర్భే చాధత్త దేవకీ, యశోదాపి సమాధత్త గర్భం తదహ రేవ హి. విష్ణోశ్శరీరతాం నిద్రాం విష్ణోర్నిర్దేశకారిణీమ్, గర్భకాలేత్వసంపూర్ణే హ్యష్టమే మాసి

శ్లో. దేవకీ చ యశోదాచ సుషువాతే సమం తదా, యామేవ రజనీం కృష్ణో జజ్ఞే వృష్ణికులే ప్రభుః.
తామేవ రజనీం కన్యాం యశోదాదే వ్యజాయత, అష్టమ్యాం శ్రావణే మాసి కృష్ణపక్షే మహాతిథౌ.
రోహిణ్యామర్ధరాత్రే చ సుధాంశావుదయోన్ముఖే, దేవక్యజనయద్విష్ణుం యశోదా తాన్తు కన్యకామ్.
ముహూర్తేఽభిజితి ప్రాప్తే హ్యర్ధరాత్రే సుఖావహే.

తస్మిన్నేవాధ్యాయే.—

శ్లో. వసుదేవ స్తతో గత్వా దేవకీగర్భవేశ్మతత్, దదర్శ దేవదేవేశం రాత్రౌ జాత మధోక్షజమ్,
శయాన మంబుజే పత్రే వటపత్రే యథా పురా, ప్రాచీనశిరసం దేవం పశ్చిమన్యస్తపాదకమ్.

ఈవచనార్థపర్యాలోచన సమగ్రముగాఁ జేయుటవలన భాగవత విష్ణుపురాణప్రతిపాదిత మాస ఋతు పక్ష నక్షత్ర తిథి రాత్ర్యాదులు మాత్రమే కాక జననముహూర్తము అభిజిత్తనియు, దేవకీయశోదలగర్భంబులం దేకరాత్రియందే శ్రీకృష్ణ యోగ మాయ లుద్భవించిరనియు, అట్టియుద్భవకాల మసంపూర్ణమగు నష్టమమాసముగా నుండె ననియు, అట్లసంపూర్ణకాలంబున జనియించినందుననే శ్రీకృష్ణమూర్తి యతని జననోత్తరకాలంబున లోకుల వాడుకప్రకారము పద్మపత్త్రముల నుంపఁబడియుండెననియు, అత్తఱి సూతికాగృహంబునఁ దేజరిల్లెడు నా శ్రీకృష్ణుండు ప్రాగ్దిజ్ఞియమితశిరస్కుండును, పశ్చిమదిగ్విన్యస్తపాదయుగళుండు నై యుండె ననియు నిట్టివిశేషార్థంబులు దెలియఁబడుచున్నవి.

శ్రీమద్భాగవతైకాదశస్కంధంబునం గలషష్ఠాధ్యాయమున నుండు శ్రీకృష్ణమూర్తి జీవిత కాలనిర్ణాయకప్రమాణవచనము శ్రీకృష్ణంప్రతి బ్రహ్మాదిదేవోక్తిః.

శ్లో. యదువంశేఽవతీర్ణస్య భవతః పురుషోత్తమ, శరచ్ఛతం వ్యతీయాయ పంచవింశాధికం విభో.

ఈవచనమునందుండు "భవతః పంచవింశాధికం, శరచ్ఛతం, వ్యతీయాయ" అనుపదములచేత బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకు రమ్మని పిలువవచ్చిన కాలమునందు నమ్మహాపురుషునికి జననప్రభృతిగతసంవత్సరములు ౧౨౫ అని తెలియఁబడుచున్నది విష్ణుపురాణమునందు నీక్రమంబుననే చెప్పఁబడియున్నది. అదెట్లనిన:—

విష్ణుపురాణము, అంశము-౫-అధ్యాయము-౩౭-శ్రీకృష్ణంప్రతిఇంద్రప్రేషితదేవదూతోక్తిః.

శ్లో. వస్వశ్విమరుదాదిత్యరుద్రసాధ్యాదిభిస్సహ, విజ్ఞాపయతి శక్రస్త్వాం తదిదం శ్రూయతే ప్రభో.
దుర్వృత్తా నిహతా దైత్యా భువో భారోఽవతారితః, త్వయా సనాథా స్త్రిదశా భవన్తు త్రిదివే పునః. పంచవింశత్యుత్తరకం శతంతు శరదాం గతమ్, ఇదానీం గమ్యతాం స్వర్గో భవతే యది రోచతే.

ఈవచనములయందుఁ దెలుపఁబడిన "పంచవింశత్యుత్తరకం శతంతు శరదాం గతమ్" అనువాక్యముచేత ౧౨౫ సంవత్సరములు జరిగినవి యని తెలియఁబడుచున్నది. హరివంశాదిగ్రంథములయం దీక్రమంబుననే తెలుపఁబడియున్నది. గ్రంథవిస్తరభీతిచేత నాగ్రంథస్థప్రమాణవచనంబుల నిచ్చుటఁ బ్రకాశపఱుప లేదు.

శ్రీమద్భాగవతైకాదశస్కంధమునం గలసప్తమాధ్యాయములో నుండు శ్రీకృష్ణమూర్తినిర్యాణకాలప్రతిపాదకప్రమాణవచనములు.

శ్లో. ఉత్తరార్థమారభ్య.—సముద్ర స్సప్తమేఽహ్న్యేతాం పురీం మాప్లావయిష్యతి. యర్హ్యేవాయం మయాత్యక్తో లోకోఽయం నష్టమంగళః, భవిష్యత్యచిరాత్సాధో కలినాఽపి నిరాకృతః.

ఈ ప్రమాణవచనార్థపర్యాలోచనవలనం దెలియఁబడిన దేమనిన, బ్రహ్మాది దేవతలు శ్రీకృష్ణమూర్తిని వైకుంఠమునకు రమ్మని విన్నవించి వారివారిలోకములకుఁ బోయినతోడనే శ్రీకృష్ణుం డుద్ధవునితో నీద్వారకాపట్టణము నేఁటి కేడవదినమునందు సముద్రునిచే నావరింపఁబడును. నేను భూలోకమును వదలఁగానే కలి ప్రవేశించును. అట్టికాల మతిత్వరితముగానే సంభవించును. అని చెప్పినందున శ్రీకృష్ణనిర్యాణకాలము కలియుగప్రవేశదిన మనియు, అట్టికలియుగాదిదివసమునకు నవ్యవహితపూర్వమాసంబుననే బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణాహ్వానము సేయ వచ్చి రనియు సూచనగాఁ దెలియఁబడుచున్నది. ఈయర్థము విష్ణుపురాణమునందు స్పష్టముగాఁ దెలుపఁబడియున్నది అ దెట్టులనిన:—

విష్ణుపురాణము, అంశము-౪, అధ్యాయము-౨౪.

శ్లో. యస్మిన్ కృష్ణోదివంయాతస్తస్మిన్నేవ తదాహని, ప్రతిపన్నం కలియుగం తస్య సంఖ్యాంనిబోధత.

ఈవచనార్థపర్యాలోచనమువలన శ్రీకృష్ణనిర్యాణదివసమునందే యీ భూలోకమునందుఁ గలి ప్రవేశ మాయెను అని దృఢముగాఁ దెలియఁబడుచున్నది. కాన మీఁదఁ దెలుపఁబడినభాగవతవచనముల యర్థమునకు సామరస్యము లెస్సగాఁ గలుగుచున్నదని తెలియఁబడినది. బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణాహ్వానమునందుఁ దెలియఁజేసిన ౧౨౫-సంవత్సరములు దైవసంవత్సరము లని చెప్పుట మరాక్షేపపరిహార విచారము.

విష్ణుపురాణము, అంశము-౫, అధ్యాయము-౨౩.

—శ్రీకృష్ణంప్రతి ముచుకుందోక్తి—

శ్లో. ముచుకుందశ్చ తత్రాదౌ వృద్ధగార్గ్యవచస్స్మరన్, సంస్మృత్య ప్రణిపత్యైనం సర్వం సర్వేశ్వరం హరిం, ప్రాహ జాతో భవా న్విష్ణో రంశ స్త్వం పరమేశ్వర, పురా గర్గేణ కథితం అష్టావింశ త్తమే యుగే. ద్వాపరాంతే హరే ర్జన్మ యదువంశే భవిష్యతి.

ఈవచనార్థపర్యాలోచనవలన శ్రీకృష్ణావతారము జగత్సృష్టి మొదలుకొని జరిగెడి యిరువదెనిమిదవమహాయుగమునందు తటస్థించునట్టి ద్వాపరయుగంబున నంతిమభాగములో యదువంశమునందు శ్రీకృష్ణమూర్తి యవతరింపఁబోవుచున్నాఁడని తొల్లి వృద్ధగార్గ్యులు చెప్పినట్లు ముచుకుందమహారాజు శ్రీకృష్ణునితో విన్నపము సేసె నని తెలుపఁబడినందున ముందుదాహరించిన ప్రమాణవచనములలో శ్రీకృష్ణునితో బ్రహ్మాదిదేవతలు తెలిపినసంవత్సరపరిగణనము, ఐహికవ్యవహారోపయుక్త్యాస్మత్ప్రభవాదిసంవత్సరములే కాని యాముష్మికలోకవ్యవహార్యమాణదైవసంవత్సరంబులు గావు. కావున మీఁదఁజెప్పనముచుకుందోక్తి చొప్పున నిరువదెనిమిదవ మహాయుగంబునఁ దటస్థించినద్వాపరయుగం బితరయుగంబునకు నవ్యవహితపూర్వంబయినద్వాపరయుగమే కాని వేఱొకద్వాపరయుగము కానేరదు. అ దెట్లనిన:—

సూర్యసిద్ధాంతము - అధ్యాయము-౧

శ్లో. ఆయుషోఽర్ధంగతంతస్య శేషాత్కాలోఽయమాదిమః, కల్పాదస్మాచ్చమనవష్షడ్వ్యతీతాస్ససంధయః. అష్టావింశద్యుగా దస్మా ద్యాత మేత త్కృతం యుగమ్, అతః కాలం ప్రసంఖ్యాయ సంఖ్యామేకత్ర పిండయేత్.

ఈవచనములయందుఁ దెలిపిన "అష్టావింశయుగాదస్మాత్" అనుదానివలన నిరువదెనిమిదవమహాయుగ మని తెలియనాయెను. ఇచ్చట యుగశబ్దము వ్యాఖ్యాతృభిప్రాయానుసారముగా మహాయుగపర మని తెలియఁ దగినది. అట్లు కానిపక్షమున దీవచనములోనే "యాతే మేత త్కృతం యుగం" అనువచనము వలనఁగృతయుగంబునకు నష్టావింశమహాయుగాంతఃపాతిత్వము ఘటింపక పోవును. కాఁగా నాక్రమంబుననే క్రిందటజరిగినకృతయుగము మొదలుకొని యిప్పుడుజరగెడికలియుగపర్యంతముఁ గలయుగచతుష్టయము నిరువదెనిమిదవమహాయుగంబునఁ జేరినవి గాన ముందు విష్ణుపురాణోదాహృతమగు "ద్వాపరాంతే హరేర్జన్మ యదువంశేభవిష్యతి" అనువచనమువలనఁ దెలిపినయుగ మీఁకలియుగావ్యవహిత పూర్వయుగం బగుద్వాపరయుగంబే యనుట సూర్యసిద్ధాంతాదినిఖిలసిద్ధాంత గ్రంథప్రతిపాదితసిద్ధాంతముతో నత్యంతసామరస్యము నొంది యున్నదిగాన మీఁదఁ దెలిపినసంవత్సరనిర్ణయము దైనసంవత్సరపర మని కుశంకలు సేయుపురుషులపలుకుల కెంతమాత్రము నవకాశము గలుగ నేరదు. అదియునుంగాక మీఁద నుదాహరించిన గర్గవాక్యానుస్మృతశ్రీకృష్ణజననకాలనిర్ణయవిషయము శ్రీమద్భాగవతమునందును సూచనగాఁ దెలుపఁబడియున్నది. అ దెట్టులనిన:—

భాగవతము - దశమస్కంధము - అధ్యాయము-౫౧

శ్లో. ఇత్యుక్తస్తం ప్రణమ్యాహ ముచికుందో ముదాన్వితః,
జ్ఞాత్వా నారాయణం దేవం గర్గవాక్య మనుస్మరన్.

ఇచట "గర్గవాక్యమనుస్మరన్" అనుటకు భాగవతవ్యాఖ్యానకర్తలును సర్వజ్ఞులు నగుశ్రీధరాచార్యులవారు "అష్టావింశతితమే మహాయుగే యదువంశే భగవా నవతరిష్యతీతి గార్గ్యవాక్య మనుస్మర న్నిత్యర్థః" అని చెప్పియున్నారు. మఱియు నాంధ్రభాగవతకర్త యగుబమ్మెరపోతనయును దశమస్కంధపూర్వభాగములో ముచికుందపూర్వకథాభివర్ణనఘట్టమునందు నంతిమవచనాంతములో "హరికి ముచికుందుండు నమస్కరించి నారాయణదేవుండ వగుట యెఱింగి యిరువదెనిమిదవమహాయుగంబునందు నారాయణుం డవతరించునని మున్ను గర్గుండు చెప్పుట తలంచి" అనివ్యాఖ్యాతృభిప్రాయానుసారముగానే తెలిపియున్నాఁడుగాన యష్టావింశమహాయుగాంతఃపతితం బగుద్వాపరయుగం బీకలియుగావ్యవహిత పూర్వప్రవృత్తయుగమే యని దృఢముగా నఖిలజనులకుఁ దెలుపుటయం దత్యంతానందంబు నొందుచున్నాము. కాఁగా శ్రీమద్భాగవత - విష్ణుపురాణ - హరివంశాది శిష్టజనాంగీకార్యంబు లగువిషయముల ససాకల్యముగా సంప్రదాయార్థమునకుఁ బొరపాటు రానటులు పరిశీలించినయెడ నఖిలసందేహంబులకు సామరస్యం బతిశ్లాఘ్యతమంబుగాఁ గలుగు ననుటయం దేమియు సందేహము లేదు. కాన నిఖిల చరాచరపోషణైకాయత్తచిత్తుం డగుభగవంతుని యవతారాదికృత్యములను గుఱించి కుమతప్రవిష్టు లగుకుజనులు సేయుకుత్సితాక్షేపణము లన్నియు నసంప్ర

దాయాధీతాపరిపూర్ణగ్రంథార్థపరిజ్ఞానప్రయుక్తావివేక మూలకము లని దృఢముగా నమ్ముచున్నారము.

నిష్కృష్టాభిప్రాయవివేచనము — మీఁదఁ దెలిపినక్రమంబున భాగవత - విష్ణుపురాణ - హరివంశాదిగ్రంథప్రతిపాదితప్రమాణవచనార్థపర్యాలోచనచేఁ గలి నిష్కృష్టాభిప్రాయం బఖిలజనులకుఁ గరతలామలకముగాఁ దెలియఁబడున ట్లదిగువ వివరించుచున్నాము.

ద్వాపరయుగపరిమిత సంవత్సరములు ౮౬౪౦౦౦ లలో ౮౬౩౮౭౪ సంవత్సరములు, ౪ నెలలు, ౨౧ దినము, గత మయినకాలమునందలి శ్రీముఖసంవత్సరశ్రావణబహుళనవమీవిద్ధాష్టమియందు రాత్రి నిశీథకాలంబున వృషభలగ్నమునందు సంఘటించిన సర్వోత్తమం బగునభిజిన్ముహూర్తంబున శ్రీమహాదినారాయణపరబ్రహ్మమూర్తి లీలాగృహీతశరీరుం డయి దేవకీదేవిగర్భంబున నర్భకుం డయి యుదయించెను. అట్టియుదయకాలంబునఁ బ్రాగ్దిఙ్నియమితశిరస్కుండును, బశ్చిమదిగ్విన్యస్తపాదుండును గళుండును, జతుర్బాహుండును, శంఖచక్రాద్యాయుధధరుండును, నధికతేజఃపుంజదీపితసూతికాగృహుండును నై పద్మపత్త్రంబుల శయనించి తేజరిల్లుచుండెను అమ్మహాత్ముం డావిర్భావంబు నొందిన మీఁదఁ దెలిపిన శ్రీముఖసంవత్సరశ్రావణబహుళాష్టమి మొదలుకొని లీలామానుషవిగ్రహంబుఁ దాల్చి భూలోకంబుననుండిన సంవత్సరంబులు ౧౨౫ ను, నెలలు ౭ ను, దినములు ౮ యును గానున్నవి. అప్పురుషోత్తముండు లీలామానుషవిగ్రహంబు వదలి మరల వైకుంఠంబు ప్రవేశించినకాలంబు కలియుగాదిమసంవత్సరం బగుప్రమాదిసంవత్సరచైత్రశుద్ధప్రతిపద్భృగువాసర మగుచున్నది. బార్హస్పత్యమానరీతిని శ్రీకృష్ణావతారసంవత్సరము పార్థివ; నిర్యాణసంవత్సరము ఖర. అట్టిజగదీశ్వరునినిర్యాణానంతరము గతసంవత్సరంబులపరిమితి ౫౦౩౫ గా నున్నవి. శ్రీకృష్ణమూర్త్యావిర్భావదినంబునందే నవమీఘటికలలో యశోదాదేవిగర్భంబున యోగమాయ జనించెను గాన యోగమాయ శ్రీకృష్ణానుజన్మ యని తెలియందగినది.

ఇదియునుంగాక నిఖిలాస్మదీయజనులకు నిత్యక్షేమము గలుగఁ జేసెడు సద్విద్యాభివృద్ధి నొందుటకు ముఖ్యసాధనంబులుగా నుండుసద్గ్రంథపరిష్కరణతత్ప్రకాశనాదిసత్క్రియలయందుఁ బ్రవర్తించి యుండెడునస్మత్సజాతీయు లగు జనులచే నత్యంతపరిశ్రమంబునం బరిష్కరింపం బడెడునస్మద్గ్రంథంబులఁ బఠించుటవలనఁ గలిగెడునానందంబు ననుభవించుసత్పురుషులు కృతజ్ఞులై యీక్రమంబుననే యస్మదీయసద్గ్రంథంబులభివృద్ధినొందుట కత్యంతసాహాయ్యంబు సేయుటయం దపరిమితాసక్తి నొంది యుండవలయు నని నిఖిలసజ్జనసద్విద్యావైదుష్యాభివర్ధనైకపరాయణుం డగునారాయణుని నిరంతరంబు ప్రార్థించుచున్నారము.

ఇట్లు,

20-7-1934.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# విషయసూచిక.

## ప్రథమస్కంధము.


| విషయము. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ఇష్టదేవతాదిప్రార్థనము | ... | 1 |
| కృతిపతినిర్ణయము | ... | 3 |
| గ్రంథకర్తృవంశవర్ణనము | ... | 4 |
| షష్ఠ్యంతములు | ... | 4 |
| కథాప్రారంభము | ... | 5 |
| సూతుండు నారాయణకథాప్రశంస సేయుట | ... | 8 |
| భగవంతుని యేకవింశత్యవతారములు | ... | 10 |
| శ్రీమహాభాగవత రచనాది వృత్తాంతము | ... | 13 |
| వ్యాసుండు వ్యాకులచిత్తుండై చింతించుట | ... | 14 |
| వ్యాసునికడకు నారదుండు వచ్చుట | ... | 15 |
| నారదుని పూర్వజన్మవృత్తాంతము | ... | 18 |
| అర్జునుండు పుత్రఘాతి యగునశ్వత్థామ నవమానించుట | ... | 22 |
| ద్రౌపది యశ్వత్థామను జూచి సంభాషించుట | ... | 24 |
| శ్రీకృష్ణుం డుత్తరాగర్భస్థుం డగునర్భకుని రక్షించుట | ... | 26 |
| కుంతీదేవి శ్రీకృష్ణుని నుతించుట | ... | 27 |
| ధర్మజుఁడు శ్రీకృష్ణసహితుండై శరతల్పగతుండైనభీష్మునికడ కేఁగుట | ... | 30 |
| భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట | ... | 32 |
| శ్రీకృష్ణుండు ద్వారకానగరంబున కరుగుట | ... | 34 |
| శ్రీకృష్ణుండు ద్వారకానగరంబు ప్రవేశించుట | ... | 36 |
| శ్రీకృష్ణుం డంతఃపురకాంతలం జూడఁ బోవుట | ... | 38 |
| ఉత్తరకుఁ బరీక్షిత్తు జనించుట | ... | 40 |
| విదురుఁడు తీర్థయాత్రలఁ జేసి కరిపురంబునకు వచ్చుట | ... | 43 |
| గాంధారీధృతరాష్ట్రులు దేహత్యాగము సేసికొనుట | ... | 44 |
| ధర్మజుఁడు దుర్నిమిత్తంబులం గని చింతించుట | ... | 47 |
| అర్జునుండు ద్వారకనుండి వచ్చి కృష్ణనిర్యాణంబు చెప్పుట | ... | 48 |
| ధర్మరాజు పరీక్షితునకుఁ బట్టముఁగట్టి మహాప్రస్థానంబున కేఁగుట | ... | 53 |
| కలిపురుషుఁడు ధర్మదేవతను దన్నుట | ... | 56 |
| పరీక్షిన్మహారాజు కలిని నిగ్రహించి ధర్మపరిపాలనము సేయుట | ... | 59 |
| పరీక్షితుఁడు వేఁటాడి శమీకునిపై మృతసర్పము నెత్తి వైచుట | ... | 61 |

విషయము. పుటసంఖ్య.


శమీకపుత్త్రుం డగుశృంగి పరీక్షితుని శపించుట ... 62
పరీక్షితుఁడు విప్రశాపం బెఱింగి ప్రాయోపవిష్టుం డగుట ... 65
శుకమహర్షి పరీక్షిన్మహారాజునొద్ద కేతెంచుట ... 67


## ద్వితీయస్కంధము.


శుకుఁడు పరీక్షితునకు ముక్తిమార్గంబు దెల్పుట ... 70
శుకుఁడు పరీక్షితునకు భక్తిమార్గంబె ముఖ్యంబని తెలుపుట ... 77
నారదుండు బ్రహ్మను బ్రపంచప్రకారంబు నడుగుట ... 81
వెలిగందల నారయకవిత్వప్రారంభము ... 86
శ్రీమన్నారాయణుని లీలావతారంబుల యభివర్ణనము ... 89
పరీక్షితుఁడు శుకునిఁ బ్రపంచోద్భవాదికంబు నడుగుట ... 99
నారాయణుండు బ్రహ్మతపంబునకు మెచ్చి వరంబు లిచ్చుట ... 102


## తృతీయస్కంధము.


విదురుండు తీర్థయాత్ర సేయుట ... 113
విదురుం డుద్ధవుం గని కృష్ణాదులవృత్తాంతం బడుగుట ... 117
విదురమైత్త్రేయసంవాదము ... 131
స్వాయంభువమనువు ప్రజావృద్ధి సేయుట ... 161
శ్రీయజ్ఞవరాహావతారాభివర్ణనము ... 162
శ్రీయజ్ఞవరాహమూర్తిని బ్రహ్మాదులు స్తుతియించుట ... 164
మైత్త్రేయమహాముని విదురునకు హిరణ్యాక్షహిరణ్యకశిపులవృత్తాంతం బెఱింగించుట. 167
సనకసనందనాదులు వైకుంఠమున కరుగుట ... 172
సనకాదులు నారాయణదేవుని స్తుతించుట ... 178
జయవిజయులు దితియందు హిరణ్యకశిపులై పుట్టుట ... 183
హిరణ్యాక్షుఁడు యజ్ఞవరాహం బగుహరి నెదిరించి పోరుట ... 186
చతుర్ముఖుం డొనర్చుయక్షాదిదేవతాగణసృష్టిఁ దెలుపుట ... 194
కర్దముఁడు భగవదనుజ్ఞ వడసి దేవహూతిని బెండ్లియాడుట ... 198
కర్దమప్రజాపతి యోగప్రభావంబుచే విమానంబు గల్పించి భార్యతోఁగూడఁ దాను విహరించుట. 204
దేవహూతిగర్భంబున విష్ణుండు గపిలాచార్యుండుగాఁ బుట్టుట ... 208
దేవహూతి పుత్త్రుండైనకపిలునిచేఁ దత్త్వజ్ఞానంబు వడయుట ... 211
కపిలుండు దేవహూతికి భక్తియోగమును దెలియఁజేయుట ... 226
కపిలుండు దేవహూతికిఁ బిండోత్పత్తిక్రమంబుఁ దెలుపుట ... 231
గర్భస్థుం డగుజీవుండు భగవంతుని స్తుతియించుట ... 232

# భాగవతప్రశంస.



శ్రీమత్సకలభూతాంతరాత్మ యై యొక్కరూపంబున దీపించువాఁ డయ్యు, సాధుజనరక్షణార్థంబును, దుర్జనశిక్షణార్థంబును, శ్రీమన్నారాయణుండు బహులీలావతార ధారణ పరాయణుం డై విలసిల్లు. అట్టియవతారంబుల నేకవింశత్యవతారంబులు మిక్కిలి ప్రధానంబులు. అందుఁ బదునేడవరూపంబునఁ బరాశరమహర్షికి సత్యవతియందు జనియించి, కృష్ణద్వైపాయనుం డన ఖ్యాతి గాంచి, మందబుద్ధులు, నల్పాయువులు నగుపురుషుల ననుగ్రహించుపొంటె నేకం బై యున్న వేదంబును ఋగ్యజుస్సామాథర్వణంబు లను నాలుగు నామంబుల విభాగించి వ్యాసుం డనఁ బ్రసిద్ధి వహించి, యితిహాసపురాణంబు లన్నియుఁ బంచమవేదం బని వచియించె.

అట్టివేదంబులు మేధావిహీను లైనపూరుషులచే బ్రాహ్మణనికరమందు ధరియింపఁబడు. వెండియు దీనరక్షణకరణకరుణావిన్యాసుం డగువేదవ్యాసుండు స్త్రీశూద్రులకు ద్రైవర్ణికాధములకు వేదంబు లాకర్ణింప నర్హంబులు గావు గావున మూఢుల కెల్ల మే లగు నని భారతాఖ్యానంబు గావించియు భూతహితంబునందుఁ దనస్వాంతంబు సంతసింపకున్న నత్యంతచింతాక్రాంతుం డై సరస్వతీతటంబున నొంటియుండి నారదోపదేశంబునఁ బురాణగుహ్యం బై విష్ణుభక్తిసంజనకం బై జ్ఞానవైరాగ్యసాధనం బైన శ్రీమహాభాగవతంబు రచియించె.

పూర్వంబున శౌనకుండు సూతు నవలోకించి కర్ణరసాయనం బగుకథాసారం బానతిండు భక్తిజ్ఞానవిరాగయుక్తం బగువివేకం బెట్లు వర్ధిల్లు? మాయామోహనిరసనంబు వైష్ణవులచే నెట్లు సేయంబడు? అత్యంతఘోరం బయినయీ కలియుగంబున జీవకోటి ప్రాయికంబుగ నాసురతం బొంది క్లేశాక్రాంతం బై యుండ వానిం గడతేర్ప నెయ్యది యోపు? పావనంబులయందుఁ బరమపావనం బైనది యేది? కృష్ణప్రాప్తికరం బైనసాధనం బేది? అని యడిగెను. సూతుం డవ్వచనంబు లాలించి నీమనస్సునందుఁ గలకోర్కిని నెఱవేర్పఁ జక్కఁగా విచారించి తెల్పెద వినుము. సర్వసిద్ధాంతనిష్పన్నంబును సంసారభయనాశనంబును భక్తిజ్ఞానవిరాగవర్ధనంబును కృష్ణసంతోషహేతుకంబును నగుశ్రీమద్భాగవతం బనుశాస్త్రంబు గాలవ్యాళముఖగ్రాసత్రాసనిరాసార్థంబు పూర్వంబు శుకునిచేఁ దెల్పంబడియె. మనశ్శుద్ధిసేయుపొంటె దీనికంటెఁ బరమ మైనశాస్త్రం బెయ్యదియు లేదు. జన్మాంతరం

బున మహాపుణ్యంబు లాచరించినజీవునకుం గాని భాగవతంబు దొరకొనదు. పరీక్షితునకు భాగవతకథను వచియింప శుకుం డుపక్రమించుటయు నత్తఱి వేల్పులమృతకుంభంబును గొని సభ కరుదెంచి శుకుం గాంచి నమస్కరించి కథాసుధను మాకిచ్చి యీసుధను మీరు పరిగ్రహించి యమృతంబు రాజునకుం ద్రావ నిండు. ఏము భాగవతామృతంబును బానంబు సేసెదము. అని నుడివిరి అంత శుకుండు వారిమాటలచే దేవతలను భక్తులు గారని తెలిసికొని వారికిం గథామృతంబు నొసంగం డయ్యె. కావున భాగవతకథామృతంబు దేవతలకేని దుర్లభంబు. అట్లు భాగవతకథామృతపానంబునం జేసి పరీక్షిన్మహారాజునకు మోక్షంబు లభింపం గనుంగొని పద్మభవుండు విస్మితుండై భాగవతసారంబును దదన్యసాధనంబులచేం దూంచి చూచెను. భాగవతసారం బన్నిటికంటె నెక్కుడయ్యె. ఋషులెల్లరు నత్యంతవిస్మయావిష్టమనస్కులైరి భగవద్రూపమైనభాగవతశాస్త్రమును గలియుగంబునం బఠించుటచేతను, వినుటచేతను, దోడ్తోన ముక్తిదాయకం బని భావించిరి. సప్తాహంబున దీనిని వినిన మోక్షప్రదం బగు ఇది సనకాదులచేంబూర్వము నారదునికొఱకు నుపదేశింపంబడియెను. సప్తాహశ్రవణవిధియును వారిచేం జెప్పంబడియె. మఱియు సనకాదులు నారదునకు భాగవతమాహాత్మ్యంబు సవిస్తరంబుగా నెఱింగించిరి. వేదాంతశ్రవణంబుచేతను భగవద్గీతాపఠనంబుచేతను లభింపని భక్తిజ్ఞానవైరాగ్యములు శ్రీమద్భాగవతపఠనంబుచే లభించి ముక్తిప్రదాయకంబులై విలసిల్లు నని భాగవతమాహాత్మ్యంబునందు నిక్కముగ స్పష్టముగాం జెప్పంబడియున్నది. ఇమ్మాహాత్మ్యము శ్రీపాద్మపురాణోత్తరఖండంబున మొదటియాఱధ్యాయంబులందుం జక్కంగా వివరింపంబడినది.

## పోతనవంశము.

అట్లు సుప్రసిద్ధమై మోక్షదాయకం బైనసంస్కృతభాగవతము నాంధ్రీకరించినమహాకవిబమ్మెర-పోతనామాత్యుండు.ఇతండు కౌండిన్యసగోత్రుండు.ఆపస్తంబసూత్రుండు. భీమనమంత్రికిం బ్రియపుత్రుండైనయన్నయకును, గౌరమాంబకును బుత్రుండు సోమనమంత్రి. సోమనమంత్రిభార్య మల్లమ. వారితనయుండెల్లన. ఎల్లనామాత్యునకు మాచమయం దుదయించినవాండు కేసన. కేసనకు లక్కమాంబయందు నీశ్వరసేవాకాముండైనతిప్పనయు, మహాకవీశ్వరుండైనపోతనయు జన్మించిరి. కవిశిఖామణి యగునీపోతనామాత్యుం డేకశిలానగరమం దుండినవాండు. అమాత్యశబ్దంబుచే నీతండు నియోగిబ్రాహ్మణుం డని యూహింపనగు.

## పోతనకవినివాసస్థానము.

ఏకశిలానగర మనునది కడపమండలములోని యొంటిమిట్టకు నామ మని కొందఱును, ప్రతాపరుద్రదేవునిరాజ్యమున ముఖ్యపట్టణ మగు నోరుగంటికి నామాంతరమని కొందఱును జెప్పుదురు.

మ్మెర పోతనామాత్యుఁ డందఱివలె గురువుల చెంతఁ బఠింపక స్వతస్సిద్ధ
ండిత్యము నొందినట్లు సహజపాండిత్య పోతనామాత్య యను గద్యములో
ంబట్టి యూహింపఁదగియున్నది. ఇతఁడు దనబాల్యంబున గోవులను
గ్రామమునకు దాపున నున్న యడవికిఁ బోయి యుండ నందుఁ జిదానందుం
గీశ్వరుం డాతనికి రామమంత్రం బుపదేశింప దానం జేసి యాతనికి నఖండ
ంబున నవద్యకవిత్వంబును లభించినట్లు కొందఱనుదురు కాని గద్యము
శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర యనుమాటలచే
కిఁ బరమేశ్వరానుగ్రహంబున నఖండకవిత్వధార యుదయించినట్లు స్పష్ట
ముగఁ దెలియవచ్చెడిని.

## పోతనామాత్యుని పేదఱికము.

ఇతఁడు పుట్టినకోలె మహాదారిద్ర్య మనుభవించినవాఁడు. మహాకవు లందఱుఁ బెక్కండ్రు దారిద్ర్యపీడితు లయ్యును మహాధనికుల నాశ్రయించి, ధనసంపన్నులై నిశ్చింతంబుగఁ దమకాలంబు గడపుచు వచ్చిరి. ఆంధ్రకవులకెల్ల శిరోమణులై కవిత్రయం బని పేరు వడసినవారియందు తిక్కన శంభుదాసులును రాజమహేంద్రవరాధీశుండగు రాజరాజనరేంద్రుని, నెల్లూరిప్రభువగు మనుమసిద్ధిరాజును, కొండవీటిప్రభువైన యనవేమారెడ్డిని నాశ్రయించి, వారివలన ధనకనకవస్తువాహనాదిసంపదలం బడసి, కవిత్వసంపదయందు లోకవిశ్రుతకీర్తులై యుండిరి. రామాయణముఁ దెలిఁగించిన భాస్కరుఁడును సాహిణిమారనవలన సమస్తసంపదలఁ బరిగ్రహించి సుఖజీవి యయ్యె. అట్లే కావ్యాలంకారచూడామణికర్త యగు విన్నకోట-పెద్దనయు విశ్వేశ్వరమహారాజాశ్రయము గాంచి మహాసంపన్నుం డయ్యె. మఱియుఁ బోతనబావ యగు శ్రీనాథకవిసార్వభౌముఁడును, దనగ్రంథముల ననేకులకుం గృతు లొసంగి కోటి వడసినంత ననుభవించె. కృష్ణదేవరాయలయాస్థానకవీశ్వరులై యష్టదిగ్గజము లని ప్రసిద్ధి వడసిన యల్లసాని-పెద్దనాదులు సర్వభోగముల సంపదలం బడసి, సౌఖ్యాబ్ధి నోలలాడుచు నుండిరి. సంస్కృతకవు లగు కాళిదాసాదులును [illegible] నాశ్రయించి శ్రీమంతులైరి. మఱి యాంధ్రభాగవతకర్త యగు పోతనామాత్యుఁ [illegible] పేదఱికంబున మునింగినను ధనార్జనమునకై రాజులం బొగడ నొల్లక కేవలకర్షకుండై తనకాలమంతయుఁ గడపెను. ఈవిషయము బమ్మెర-పోతనయే భాగవతప్రథమస్కంధమున నిట్లు నుడివె.

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటపోటులం బడక సమ్మతితో హరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

ఇట్లు మహాదారిద్ర్యంబు ననుభవింప దాని సహనయింప నతనిబావ ం శ్రీనాథుండు భాగవతంబును దనప్రభువైనకర్ణాటప్రభువునకు నంకితము నేఁ నెంచి పల్లకిపై నొంటిమిట్టకు రా నయ్యూరివెలుపల మడక గట్టించి పోతన కుమారునిచేఁ బొలమును దున్నించుచుండెను. శ్రీనాథుండు దనమహిమ ం దెలుపఁగోరి యాందోళికావాహకులను నొకకొమ్ము విడువుం డని యాన నఁట. ఒకవైపున మోచువారు లేకయే యందలము నడవంజూచి పోతనకుప రుండైన మల్లన దనతండ్రితో నాచిత్రముం జెప్పఁగా నాతండు నాఁగటికాఁడికిఁ గట్టినయొకటున్నను వదలు మని యాజ్ఞాపెరిచెనఁట. దున్న యొకండు లేకయే నాఁగలి సాగుచుండుటఁ జూచి శ్రీనాథుండు తనయందలపు రెండవకొమ్మునుగూడ విడువఁ బోయలకు నుత్తరువు సేయ వారు నట్లు చేసిరి. అందలంబు నెప్పటియట్లు నడచు చుండె. పోతనయుఁ దనకుమారునిచే నాఁగటికి మఱియొక ప్రక్కనున్న దున్నను విడువ నియోగించెను. అరకయు పశువులు లేకయే నడచుచుండెను. శ్రీనాథుండు తనకుంబోలె నాతనికిని సామర్థ్యంబు గల దని తెలిసికొని పోతనను సమీపించి హాలికులు సుఖమున్నారా? యని పరిహాసపూర్వంబుగఁ గుశలప్రశ్నంబు సేయ

ఉ. బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకం
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై.

అని యుల్లకుట్టుమాట లాడెననియు నంత శ్రీనాథుం డాతని దనబిగికౌఁగటం గ్రుచ్చి, బావా వేడుకకై మేల మాడినఁ గినియ నగునే యని యాతనినూరార్చి,

క. కమ్మనిగ్రంథం బొక్కటి, యిమ్ముగ నేనృపతి కైనఁ గృతి యిచ్చినచోఁ
గొమ్మని యియ్యరె వెయ్యి, క్లిమ్మహి దున్నంగ నేల యిట్టిమహాత్ముల్.

అని నరాంకితంబు సేయఁ బురిగొల్పుచు వారిం గూడి యింటి కేఁగె. బమ్మెరపోతన దనయింటఁ బాకసామగ్రి యేమియు లేమిం జేసి తనపుత్త్రుం డగుమల్లన నెటకేని నప్పు దేరం బనుప నతండు ఋణం బెందును లభింప నోపక మగిడి గృహంబున కరుదెంచుటయుఁ బోతన యిందఱికని నేఁ డెప్పగిది నోరెంబు సమకట్టువాఁడనని కొండొక వగచి యెట్టకేలకు దిట్టతనం బవలంబించి బావను దక్కుం గలవారలను స్నానంబు సేసి రాఁ బంచి సరస్వతీదేవిని నిజస్వాంతంబున నత్యంత భక్తియుక్తుండై ధ్యానింప నమ్మహాదేవియు నాతనికి సాక్షాత్కరించి, బానసంబున నొకతెర గట్ట నాజ్ఞాపించి యాతం డట్లు సేయ నే నెల్లను సమకూర్చెద వగవ వలదని యనునయించె పదంపడి శ్రీనాథుండు సుస్నాతుండై తనవారినెల్ల వెంటఁ బెట్టుకొని పోతనామాత్యగృహంబునకు వచ్చి యచ్చటఁ బాకకార్యము లేవియు నొనరింపకుండుట కచ్చెరువడి తానును దనవారలును భుజింప వరుసలు

హార్చుండిరి. అప్పుడు తెరమాటున నున్నసరస్వతీదేవి తన కందియ పోతనా త్యునిభార్య పంచభక్ష్యపరమాన్నయుక్తంబు లగుచతుర్విధాహారంబులం తెచ్చి తనియునట్లు వారి కందఱకు వడ్డించెను. శ్రీనాథుండు లోనగువారు మాహాత్మ్యంబున కబ్బురపడిరి భోజనానంతరము శ్రీనాథుండు తనబావ గనుంగొని కవిరత్నంబ వగు నీ విట్టినిప్పచ్చరంబునం దొప్పదోఁగ నేల? నీ ఋంసుభాగవతంబు నేరాజునకేని నంకితం బొనరించి సమస్తసంపద లార్జించి ఋఖం బుండరాదే? ఆముష్మికసుఖంబుపై నాశచే నైహికసుఖంబు గోలుపుచ్చనేల! యని పలుమఱు బోధించుచు నాతనిం బట్టువఱుప నంతలో భారతి యాతని యెట్టయెదుటఁ బొడకట్టి వలవల నేడువఁగాఁ బోతనయు

ఉ. కాటుకకంటినీరు చనుఁగట్టుపయిం బడ నేల యేడ్చె దో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల యోమదంబ యో
హాటకగర్భురాణి నిను నాఁకటికిం గొనిపోయి యల్లక
ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్మ భారతీ.

యని సరస్వతి నూరార్చెనఁట. ఆకాలమునం దాంధ్రరాజులనేకర్ణాటరాజు లనుచు వచ్చిరి. అంత శ్రీనాథుండు విఫలమనోరథుం డై తనయూరు సేరెనఁట.

## గ్రంథపాతవివేచనము.

వ్యాసవిరచితభాగవతంబును బమ్మెరపోతరాజాంధ్రీకరించె నన్నవార్తను సర్వజ్ఞసింగభూపాలుఁ డాకర్ణించి యాకవీంద్రుఁ దనయాస్థానంబునకు రావించి తదీయగ్రంథమును జదివించి దనకాగ్రంథంబు గృతి యిమ్మని యడిగె ననియు నతఁడు తనగ్రంథంబు నరాంకితంబు సేయ నొల్ల నని తెలుప రాజు నత్యంతకుపితాంతరంగుండై యాతనిగ్రంథమును నేలం బాఁతిపెట్టించె ననియు శ్రీరామమూర్తి యారాజుభార్యకు స్వప్నంబునం దోఁచి భర్తను వేఁడుకొని భాగవతంబు లోకంబున వ్యాపింపఁజేయ నీయుకొలుపు మని యాయమతోఁ జెప్పి పోయె ననియు నాసతి నిజస్వప్నవృత్తాంతంబు దనభర్తకు నివేదించి పాఁతిపెట్టినగ్రంథంబు వెలికిఁ దీయింప నందలి తాళపత్త్రంబులు పురుగులు దిని పెక్కుభాగములు శిథిలము లై పోయె ననియు వానినెల్ల గంగనాదికవులు పూరించి రనియుఁ గొందఱు నుడువుదురు. లక్షణసారసంగ్రహంబందుఁ గూచిమంచి తిమ్మకవి రచియించిన యీ క్రిందిపద్యము పైవృత్తాంతమునకు సమర్థక మై యున్నది.

సీ. ఘనుఁడు పోతనమంత్రి మును భాగవతము రచించి చక్రికి సమర్పించునెడల
సర్వజ్ఞసింగయక్ష్మావరుం డది తన కిమ్మని వేఁడఁగా నీయ కున్న
నలిగి యాపుస్తకం బవనిఁ బాఁతించినఁ జివికి యం దొకకొంత శిథిలమయ్యెఁ
గ్రమ్మఱ నది వెలిగందలనారపరాజును మఱిబొప్పరాజు గంగ
తే. రాజు మొదలగుకవివరుల్ తేజ మెసఁగఁ, జెప్పి రాగ్రంథములయందె తప్పు లొదవెఁ
గాని పోతకవీంద్రునికవితయందు, లక్షణం బెందుఁ దప్పునా దక్షహారిణి.

అట్టు లుత్పన్నంబు లైనభాగంబులు పోతనశిష్యవర్గములో వెలిగందల-నారయ మొదలగువారిచేఁ బూరింపఁబడెనవి. కాని ఏయేభాగ కవులచే రచియింపఁబడెనో దాని నిర్ణయింపవలయు నాధారంబు లెందు ద్వితీయస్కంధమున బ్రహ్మ నారదునకుఁ దత్త్వోపదేశంబు నేఁ

ఉ. అట్టియనంతశక్తి జగదాత్మునినాభిసరోజమందు నేఁ

బుట్టి ... ... ... ... నామనంబునన్. స్కం.

అను పద్యము మొదలుకొని వెలిగందల - నారయ చెప్పినకవిత్వ మని ముద్రితభాగవతగ్రంథములలో లిఖింపఁబడియున్నది ద్వితీయస్కంధాంత గద్యముం జూడఁ బోతనామాత్యరచితం బనియే యున్నది. తృతీయ చతుర్థ స్కంధంబులును బోతనామాత్యప్రణీతము లనియే యున్నది. పంచమస్కంధాంత గద్యమున గంగనార్యప్రణీతం బనియు షష్ఠస్కంధాంతగద్యమున సింగయనామ ధేయప్రణీతం బనియు నున్నది సప్తమాష్టమనవమస్కంధంబులును దశమస్కంధ పూర్వభాగమును బోతనామాత్యప్రణీతము లని యున్నది. దశమస్కంధోత్తర భాగంబున శ్రీకృష్ణుఁడు కేళీగృహమునందు రుక్మిణీదేవితో విరసోక్తులాడుట అను ఘట్టమున

సీ. కాటుక నెఱయంగఁ గన్నీరు వఱద లై కుచకుంభయుగళకుంకుమము వడియ

... ... ... ... ... ... పువ్వుఁబోలె. 237.

అను సీసపద్యము మొదలు వెలిగందల - నారయకవివిరచిత మని ప్రాచీనపండితజన లిఖితపుస్తకములయందుఁ జెప్పఁబడియున్న దని పూర్వముద్రితగ్రంథపీఠికయందుఁ దెల్పఁబడి యున్నది. ఏకాదశద్వాదశస్కంధాంతగద్యములయందు వెలిగందల నారాయణనామధేయప్రణీతం బని యున్నది ఇంతియ కాక పోతనామాత్యవిరచితము లని గద్యము లున్నస్కంధములలో నేయేస్థలంబుల నేయే పద్యముల నేయేకవు లెం తెంతభాగములు రచియించిరో నిర్ణయింప రాకున్నది. శైలిభేదంబుల వలనఁ గొంత కొంత యూహింపవచ్చును గాని కలరూపు నిశ్చయింప దురవగాహంబు.

## పోతనకాలము.

మీఁదఁ జర్చింపఁబడినవిషయములం బట్టి బమ్మెర-పోతరాజు శ్రీనాథమహాకవికిని సర్వజ్ఞసింగభూపాలునకును సమకాలికుఁడు. శ్రీనాథుఁడును, సింగమనాయనికి సమకాలికుఁ డైన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చెడిని.

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి దక్షిణాధీశుముత్యాలశాలఁ

బలుకుఁదోడై తాంధ్రభాషామహాకావ్యనైషధగ్రంథసందర్భమునను

బగులఁ గొట్టించితి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టుకంచుఢక్కఁ

జంద్రశేఖరక్రియాశక్తిరాయలయొద్దఁ బాదుగొల్పితి సార్వభౌమబిరుద

తే. మెటుల మెప్పించెదో నన్ను నింక మీఁద, రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు, సరససద్గుణనికురుంబ శారదాంబ.

అని వేంకటగిరియందుండి సమస్తవిద్యలయందు నిరుపమానపాండిత్యంబు గలిగి సర్వజ్ఞుఁడని వాసి కెక్కినరావుసింగభూపతియాస్థానంబున కేఁగుతతి నెక్కడ నేనిఁ దప్పులు కలుగునో యని భయంపడి చింతామణిమంత్రరాజమునఁ దనకుఁ బ్రసన్నురాలైనసరస్వతీదేవిని సంస్తుతించెనఁట.

శ్రీనాథుఁడు సింగభూపతిని దర్శించినవెనుక సింగభూపతియాస్థానమందలి యొకబట్టురాజు శ్రీనాథుని వంచించుటకై హాస్యవ్యాజంబున 'కుక్కవో నక్కవో ఫణివో క్రోఁతివో పిల్లివో భూతపిల్లివో' యని సమస్య నీయఁగా శ్రీనాథుఁడు

ఉ. తక్కక రావుసింగధరణీశ్వరుఁ డర్థుల కిచ్చు చున్నచో
దిక్కుల లేరికర్థుని దధీచిని ఖేచరు వేల్పుమ్రానిఁ బెం
పెక్కినకామధేనువు శిబీంద్రుని నెన్నెదు బట్టదిట్టవై
కుక్కవో ... ... ... పిల్లివో.

అని పూరించెనఁట. (ఈపద్యమున మొదటిపాదమునందు యతిభంగము. కావున నిది శ్రీనాథవిరచితము కాదని తోఁచెడిని. 'తక్కక' అనునది 'ఇక్కడ' అని యుండిన మేలు.)

మఱియు బమ్మెరపోతరాజు వేంకటగిరి సంస్థానమునకుఁ బ్రభువైన సర్వజ్ఞసింగభూపాలునియాస్థానపండితుఁడై యుండుటకుఁ బోతరాజప్రణీతమైన భోగినీదండకము తార్కాణమై యున్నది. ఈదండకము సర్వజ్ఞసింగమనాయఁడుంచు కొన్న వేశ్యావిషయమయి రచియింపఁబడినది. దానికవిత్వ మించుమించుగా భాగవతమును బోలియుండును. ఈదండకము తుది నీక్రిందిపద్యము గూర్పఁబడి యున్నది.

ఉ. పండితకీర్తనీయుఁ డగుబమ్మెరపోతన యాసుధాంశుమా
ర్తాండకులాచలాంబునిధితారకమై విలసిల్ల భోగినీ
దండకము న్రచించె బహుదానవిహార్తకు రావుసింగభూ
మండలభర్తకు న్విమతమానవనాథమదాపహర్తకున్.

కావున శ్రీనాథుఁడును సర్వజ్ఞసింగభూపాలుఁడును బమ్మెరపోతరాజును సమకాలికులు.

సర్వజ్ఞసింగమనాయఁడు 1422 సం. మొదలు 1447 సం. దాఁక రాజ్యమును బాలించెను ఇతఁడు ప్రౌఢదేవరాయలకు సమకాలికుఁడు. సింగభూపతి రసార్ణవ సుధాకర మను నామాంతరంబు గల సింగభూపాలీయనామ కాలంకారశాస్త్రమును సంగీతరత్నాకరవ్యాఖ్యను మఱికొన్ని సంస్కృతగ్రంథములను రచించి, సర్వజ్ఞ

బిరుదమును వహించినవాఁడు. వీనియందు రసార్ణవసుధాకర మను గ్రంథము రసనాటకాదివిషయమై మూఁడుల్లాసములుగ రచియింపఁబడినది ఇది యత్యుత్తమ గ్రంథము కావ్యపంచకమునకు వ్యాఖ్య యొనరించి మహామహోపాధ్యాయుఁ డనుఖ్యాతి వహించినమల్లినాథసూరిచేఁ దనవ్యాఖ్యలయం దచ్చటచ్చట నుదాహరింపఁబడినది రఘువంశసప్తసర్గమందు నిందుమతీపరిణయఘట్టమున 'తాం ప్రత్యభివ్యక్తమనోరథానాం' అను శ్లోకవ్యాఖ్యానమందు "తత్ర శృఙ్గారలక్షణం రసార్ణవసుధాకరే—విభావై రనుభావై శ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః" అనునది లోనుగా శృంగారలక్షణము రతిలక్షణము అనుభావలక్షణము సింగభూపాలీయంబున నుండి యుదాహరింపఁబడియె.

మైసూరియందు ముద్రించిన రసార్ణవసుధాకరంబు నుపోద్ఘాతమునను "మల్లినాథేన చ బహవో ఽస్మాద్గ్రంథా త్సముద్ధృతా రఘువంశాదివ్యాఖ్యానేషు లిఖితా దృశ్యంతే" అని వ్రాయఁబడినది అలంకారశిరోమణియందుఁ బ్రతాపరుద్రీయవ్యాఖ్యయందును శాకుంతల బాలరామాయణాదినాటకవ్యాఖ్యలు లోనగు ననేకగ్రంథములయందు నీగ్రంథము ప్రమాణముగాఁ బరిగ్రహింపఁబడినది హూణశకము పదునాల్గవశతాబ్దము నుత్తరభాగమున నీగ్రంథమును రచియించినట్లున్నది. కాన 10 వ తరము సింగమనాయఁడే రసార్ణవసుధాకరకర్త యని యింతదాఁక వ్రాయఁబడినగ్రంథములలోఁ గాన్పించుచున్నది కాని యది సరికాదు. రసార్ణవసుధాకరగ్రంథసందర్భము చేతను మఱికొన్ని కారణములచేతను నేడవతరముసింగభూపతియే రసార్ణవసుధాకరకర్తగాని పదవతరమువాఁడు కాఁడు. ఈవల చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునదొరకినప్రౌఢదేవరాయలవారిశాసనము(స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1380 అగు నేఁటిబహుధాన్యసంవత్సర మాఘ బ 30 సోమవారము సూర్యోపరాగ పుణ్యకాలమునందు ఆత్రేయసగోత్రోద్భవు లైన శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర రాజశ్రీ ప్రౌఢదేవరాయలు విద్యానగరమందు వజ్రసింహాసనారూఢు లై పృథివీరాజ్యంబు చేయుచును శ్రీశైలమునకు తులాభారము తూఁగను వచ్చి బహుధాన్య సం. మాఘ బ 30 సోమవారము సూర్యగ్రహణపుణ్యకాలమందు స్వాతీనక్షత్రమందు సిద్ధాపురము సీమలోనికి చెల్లివచ్చే చిన్న అనంతాపురగ్రామము గార్గేయసగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయు లైననిడిచెనమెట్ల తిరుమలభట్లు గంగావఝ్ఝలు అన్నావఝ్ఝలు గారికిన్ని భారద్వాజసగోత్రు లైన ఆపస్తంబసూత్రు లైన బొందలపాటి తిరుమలభట్లవారికి నగ్రహారముగ నిచ్చిరి) ననా రాజు శాలివాహనశకము 1380 అనఁగా హూణశకము 1458 సంవత్సరము తులాభారము దూఁగుటకై శ్రీశైలంబునకుఁ బోయినట్లు దెల్పఁబడి యున్నది గాన యంతకుమున్ను యీతఁడు రాజ్యమేలుచున్నట్లు స్పష్టపడుచున్నది. కాఁబట్టి దీనింబట్టి ప్రౌఢదేవరాయలు 1458 సంవత్సర

మునకుఁ బూర్వమే యెప్పుడో రాజ్యారంభము సేసినట్లు తోఁచెడిని. శ్రీనాథుఁడు కొండవీటికైఫీయత్తులో నున్న ప్రకారము కోమటివెంకారెడ్డి యాస్థానకవిగా నున్నవాఁడు. కోమటివెంకారెడ్డి 1395 సం. మొదలు 1423 సం దాఁక రాజ్యము చేసినాఁడు 1379 సం మొదలు 1401 సం దాఁక రాజ్యము చేసిన హరిహరరాయలు ఒంటిస్తంభపుమేడ కట్టింపఁదలఁచి సభయందుఁగూర్చుండి యెవరైన నొంటిస్తంభపుమేడ యింతకుఁ బూర్వము కట్టినారా యని యడుగ నచ్చట నున్న శ్రీనాథుఁడు లేచి కోమటివెంకారెడ్డి కొండవీటిలోఁ గట్టించుచుండె నని చెప్పెను. హరవిలాసమును గృతినొందినతిప్పయ్య కొండవీటికుమారగిరిభూపాలునకుసుగంధ ద్రవ్యము లిచ్చువాఁడు. కుమారగిరి భూపాలుఁడు 1381 సం మొదలు 1395 సం. దాఁక రాజ్యము చేసినవాఁడు. వీరభద్రరెడ్డిపేరుగ 1415 సంవత్సరమునకుఁ బూర్వమే రాజ్యమునకు వచ్చి 1436 సం. దాఁక రాజ్యము చేసినట్లు దృష్టాంతములు గల యల్లాడ-వేమారెడ్డియెుద్ద నతఁ డాస్థానకవీశ్వరుఁడుగా నుండెను.

మఱియు భీమేశ్వరపురాణములోని

ఉ. అన్నయమంత్రిశేఖరుఁ డహమ్మదుశాసనదానభూమిభృ
త్సన్నిధికిన్ మదిన్ సముచితంబుగ వేమమహీసురేంద్రరా
జోన్నతి సంతతాభ్యుదయ మొందఁగఁ బారసిభాష వ్రాసినం
గన్నులపండు వై యమరుఁ గాకితమందలివర్ణపద్ధతుల్.

అనుపద్యమువలన నహమ్మదుషా రాజ్యమునకు వచ్చినతరువాతనే భీమఖండము రచియింపఁబడినట్లు తేలుచున్నది. ఈతఁడు కల్బరిగ (Kulburga) రాజధానిగఁ బరిపాలించెను. భామినీరాజులలో నహమ్మదుషా యెుకఁడు. ఈయన క్రీ.శ. 1422 సం. మొదలు 1435 సం. దాఁక రాజ్యము చేసెను. దీనినిబట్టి భీమఖండము 1424 సం. ప్రాంతమున శ్రీనాథుఁడు రచించి యుండు నని చెప్పనగును. కావున నితఁడు క్రీ.శ. 1384 సం. ప్రాంతమున జన్మించి. 1404 సం న నైషధము, 1424 సం. ప్రాంతమున భీమఖండము, 1432 ప్రాంతమునఁ గాశీఖండము నాంధ్రీకరించి యుండును. కావున శ్రీనాథుఁడు 1384 సం. న జన్మించి 1422 సం. లకుమీఁద జీవించినవాఁడు. సర్వజ్ఞసింగమనాయఁడు 1422 మొదలు 1447 వఱకు పాలించినవాఁడు. పైఁగనిన యిద్దఱకాలమునుబట్టి చూడఁగా బమ్మెర - పోతరాజు పదునేనవశతాబ్దపు మొదటియర్ధభాగమున నున్నవాఁ డని తోఁచుచున్నది.

## కవిత్వ ప్రశంస.

ఇమ్మహామహునికవిత్వ మతిమృదులపదఘటితంబు గావునఁ గర్ణరసాయనంబై శబ్దార్థాలంకారభాసమానంబు గావునఁ బండితపామరజనమనోరంజనంబై యెల్లవారిహృదయారవిందంబుల కమందానందం బొసంగక మానదు. అర్థమాపాతస్ఫూర్తి గలిగి యుండుఁ గావునఁ గేవలము ద్రాక్షాపాకంబై యుండును, సమ

తా ప్రసాదమాధుర్యాదికావ్యగుణంబులు నెల్లెడఁ జూపట్టు. తత్తద్రసానుగుణం బుగ శైలియు సముచితవృత్తిరీతులును గూర్చి రసపోషణంబు గావించుటయందీకవి యత్యంతసమర్థుఁడు బహువిధవర్ణనంబులచే నొప్పారి, తత్త్వార్థవివృతిచే నెంతయు భాసిల్లి నిరుపమానమధురవాఙ్మయమాధురీధురీణకవిత్వధారాపూరంబు పోతన రచనయం దెల్లెడ నమృతవాహినియుంబోలె మానసోల్లాసజనకం బై శ్రోతల నితాంతసంతోషపారావారంబున నోలలార్చు. అర్థసారస్యం బంతగాఁ బాటింప కున్నను పదవాక్యగ్రథనంబునం దనురూపపాటవంబు గలిగి రసానురూపరచ నానియమంబున విలసిల్లునట్లు పోతనామాత్యుండు గృతి సేయ సమర్థుం డని గ్రంథభాగంబులందు నేర్పరులకుఁ దెల్లంబుగఁ దెలియవచ్చు. ఏరసమును వర్ణించినను భక్తిసముద్దీపనం బించుకయైనను గొఱవడకయుండు. రసపుష్టియందును శబ్దాలంకారవైచిత్ర్యయందును నీకవికి సంపూర్ణదృష్టియుండుటంబట్టియే యితనికవిత్వంబునం దచ్చటచ్చటఁ బదాడంబరంబు వ్యర్థపూరణపదంబు ప్రయోగింపఁబడినను వీనులకు విందై యుండు. విష్ణుభక్తి యెంతయు భక్తులమనంబులం బాదుకొనునట్లు హరిమహిమంబుల నానావిధంబుల వర్ణించియుండుటంజేసి భాగవతంబు చదువం జదువ భక్తులకు మేను పులకరించి మఱపు గలుగు. ఇక్కవిపుంగవుండు సింగ భూపాలునిగుఱించి భోగినీదండకమును రచియింప నారాజశిఖామణి యాదండక మాలించి తానొకవారకాంతకు లోఁగినకతంబున నత్యంతలజ్జాభరితాంతఃకరణుం డైనం దనమనంబున నెఱింగి.

ఆ. "రసికు లైనవారు రమణులకొకచెక్క సంగు టెల్ల ధర్మవర్తనంబు
ఈరసమున విల్లు నారికి వంగదా, చిత్తజాతరూప సింగభూప."

అనుపద్యమును దోడ్తోన చెప్పి తనచమత్కృతి చూపినట్లే భాగవతంబున నయ్యెయెడల మిక్కిలి పొంకముగా శృంగారరసమును బోషించుటయందు నెంతయు వలంతి. ఐనను దక్కుంగలరసంబులును సందర్భానుసారిగఁ గూర్చ మిక్కిలి నేర్పరి. ఏవిషయ మెట్లు వర్ణించినను భక్తులభక్తి యంతకంతకు నగ్గలం బై యభివృద్ధి గాంచునట్లు నుడికారం బిం పెసలార గ్రంథంబు రచియింప నోపు ననుట కించుకేని సందియంబు లేదు.

శబ్దాలంకారంబులం దంత్యప్రాసనియమంబు పాటించుట కవుల కందఱకు సామాన్య మైయున్నను నీకవి యెంతయు హృదయంగమంబుగఁ దనగ్రంథంబునం బెక్కుచోట్లఁ బ్రయోగించియున్నాఁడు. దీని కుదాహరణంబులఁ గొన్నింటిఁ దెల్పెద. విషయ మొకటియే యయ్యేనేనిఁ బదము లన్నియు నించుమించుగ నొక్కటిగనే యుండును. పరికించునది.

ఉ. ఆతత సేవఁ జేసెద సమస్తచరాచరభూతసృష్టివి
జ్ఞాతకు భారతీహృదయసౌఖ్యవిధాతకు వేదరాశిని

ర్ణేతకు దేవతానికరనేతకుఁ గల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిలతాపసలోకశుభప్రదాతకున్. స్కం. 1. ప. 3

ఉ. ధాతవు భారతశ్రుతివిధాతవు వేదపదార్థజాలవి
జ్ఞాతవు కామముఖ్యరిపుషట్కవిజేతవు బ్రహ్మతత్త్వని
ర్ణేతవు యోగినేతవు వినీతుఁడ వీవు చలించి చెల్లరే
కాతరుకైవడిన్ వగవఁ గారణ మేమి పరాశరాత్మజా. స్కం. 1. ప. 89

మీఁదిపద్యమునే సింగయ షష్ఠస్కంధమందు నిట్లు వ్రాసియున్నాఁడు

ఉ. ధాతకు దేవతావిభవధాతకుఁ బుణ్యజనానురాగసం
ధాతకు సర్వలోకహితధాతకు వైదికధర్మమార్గని
ర్ణేతకు నుల్లసద్విభవనేతకు సర్వజగజ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్యయోగిజనభావవిజేతకు మ్రొక్కి యయ్యెడన్. స్కం. 6. ప. 278

క. రామున్ మేచకజలద, శ్యామున్ సుగుణాభిరాము సద్వైభవసు
త్రామున్ దుష్టనిశాటవి,రాముం బొమ్మనియెఁ బంక్తిరథుఁ డడవులకున్. స్కం. 2. ప. 160

(ఈపద్యమును భాస్కరరామాయణములోని బాలకాండమందలి

క. రాముఁడు మేచకజలద,శ్యాముఁడు సుగుణప్రభావసంయమివినుతి
స్తోముఁడు గిరిజాధిపనుత,నాముఁడు వ్యాత్రచ్చెఁ గుశికనందనుతోడన్.

అను 339 వ పద్యముతోఁ బోల్చి చూచునది.)

క. చనిచని ముందట గనుఁగొనె, ఘనపాపతమఃపతంగఁ గరుణాపాంగం
గనదుత్తుంగతరంగన్, జనవరనుతబహుళపుణ్యసంగన్ గంగన్. స్కం. 3. ప. 178

(మహాస్రగ్ధర. ఘను లారాజన్యసూనుల్ గని రెదురఁ గృతాకాశగంగాపరిష్వం
గను రంగత్తుంగభంగం గలితజలవిహంగన్ సదాశంభుసంగన్
మునిగేహోపాంతరంగన్ మురహరపదసంభూతపూతాంబుసంగన్
జనితాంహోభంగచంగన్ సగరనృపసుతస్వర్గసోపానగంగన్.

అనుభాస్కరరామాయణబాలకాండమందలి 343 వ పద్యముతోఁ బోల్చునది.)

(ఈక్రిందిపద్యము లన్నియు నొక్కతీరుననే యున్నవి. పోల్చి చూచునది.

క. చని ముందటఁ గనుఁగొనె మధువనమును మునిదేవయోగివర్ణితగుణపా
వనమును దుర్భవజలదపవనమును నిఖిలైకపుణ్యవరభవనంబున్. స్కం. 4. ప. 269

మ. అటఁ గాంచెం గరిణీవిభుండు నవఫుల్లాంభోజకహ్లారమున్
నటదిందీవరవారముం గమఠమీనగ్రాహదుర్వారమున్
వటహింతాలరసాలసాలసుమనోవల్లీకుటీతీరముం
జటులోద్ధూతమరాళచక్రబకసంచారంబుఁ గాసారమున్. స్కం. 8. ప. 42

మ. కనియెం బుణ్యజనౌకమున్ వికసరోగస్వప్నపీడాన్నఘౌ
ఘదపసంశోకముఁ బుష్పపల్లవఫలోద్దామద్రుమానీకమున్

స్వనితోద్ధూతపతాకముం బ్రవిచరద్వైమానికానీకముఙ్
ఘనగంగాసలిలైకముఙ్ మఘవదుక్తశ్రీకముఙ్ నాకమున్. స్క. 8. ప. 446

శా. చండస్ఫూర్తి వటుండు గాంచె బహుధాజల్పన్నిశాటంబు ను
ద్దండాహూతమునీంద్రభిక్షదమృతాంధస్సిద్ధకూటంబు వే
దండాశ్వధ్వజినీకవాటము మహోద్యద్ధూమసంఛన్నమా
ర్తండస్యందనఘోటముఙ్ బలిమఖాంతర్వేదికావాటమున్. స్క. 8. ప. 531

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డట వోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యముఁ దాపసోత్తమశరణ్యము నుద్ధతబర్హిబర్హలా
వణ్యము గౌతమీవిమలవాఃకణపర్యటనప్రభూతసా
ద్గుణ్యము నుల్లసత్తరునికుంజవరేణ్యము నగ్రగణ్యమున్. స్క. 9. ప. 268

శా. ఆరాజేంద్రుఁడు గాంచె భూరివిధరత్నాగారముఙ్ మీనకుం
భీరగ్రాహకఠోరముఙ్ విపులగంభీరంబు నభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్యవిభిన్నభంగభవనిర్ఘోషచ్ఛటాంభఃకణ
ప్రారుద్ధాంబరపారముఙ్ లవణపారావారముం జేరువన్. స్క. 9. ప. 279

మ. కనియెం గృష్ణుఁడు సాధుసీరము మహాగంభీరముం బద్మకో
కనదాస్వాదవినోదమోదమదభృంగద్వంద్వఝంకారముఙ్
ఘనకల్లోలలతావితానవిహరత్కాదంబకోలాహల
స్వనవిస్ఫారము మందవాయుజకణాసారంబుఁ గాసారమున్. స్క. 10. పూ. భా. ప. 491

ఉ. ఆసమయంబునఙ్ విభుఁ డనంతుఁడు కృష్ణుఁడు చిత్రమూర్తి యై
చేసెను మండలభ్రమణశీలపరస్పరబద్ధబాహుకాం
తాసువిలాసముఙ్ బహువిధస్ఫురితానహస్తపాదవి
న్యాసము రాసముం గృతవియచ్చరనేత్రమనోవికాసమున్.

స్క. 10. పూర్వ. భా. ప. 1081

ఉ. రాకొమరుల్ గనుంగొనిరి రమ్యగుహాగతకిన్నరీకముఙ్
స్వీకృతనాకసింధుజలసేకము సంకులచంతిచంతిభి
స్ఫారపుండరీకమును దీపితసంయమివేదనాదని
ర్వారము సిద్ధసేవితశరపరిపాకము బుద్ధ్యపూర్వకమున్.

(ఇది భాస్కరరామాయణారణ్యకాండములోని 135 వ పద్యమునందలి
యనుప్రాసమును జూచునది.)

ఇట్లే సింగయయును బ్రయోగించినాఁడు.

క. కింకరుల ధర్మరాజవశంకరుల దురంతదురితసమధికజననా
శంకరుల సకలలోకభయంకరులం గనియె నింద్రియాఘులుఁ డగుచున్. స్క. 6. ప. 68

మ. కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీఁకన్ రోషనిర్ధూతలన్
ఘనపీనోష్ఠపిశాచవక్త్రవిలసద్గర్వేక్షణోపేతులన్

జనసంత్రాసకరోద్యతాయతసుపాశశ్రేణికా హేతులన్
హననవ్యాప్తివిభీతులన్ ముపుర నాత్మాసేశలన్ దూతలన్. స్కం. 6. ప. 70

క. భటునిన్ రతిశాస్త్రకళా,ర్భటునిన్ వరయూవనానుభవమదవిభవో
ద్భటునిన్ సురతేచ్ఛాసం,ఘటునిన్ విగతాంబరోరుకటునిన్ విటునిన్. స్కం. 6. ప. 97

నాచనసోమనాథమహాకవియు నిక్కరణిన యంత్యానుప్రాసమును దనహరి వంశంబునఁ బ్రయోగించినాఁడు. ఉదాహరణము.

చ. భయరసమగ్నులం బ్రధనభగ్నుల దుర్భరదైన్యభుగ్నులన్
నయనవిలగ్నుల న్నివసనాయితనిర్వ్రతనగ్నులం బరా
జయపరివిగ్నులం బ్రణతసారవలగ్నుల నగ్నులం బిలే
శయశయనుండు సూచి చన సాగె గిరివ్రజరాజధానికిన్. ఆశ్వా. 6. 48

మఱియు ననుప్రాసంబు లనేకవిధంబుల నతిచిత్రముగ నీకవి ప్రయోగించి యున్నాఁడు. క్రిందివానిం బరికించునది.

## నామవాచకములయందుఁ జిత్రము.

క. చిత్రంబులు త్రైలోక్యప,విత్రంబులు భవలతాలవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజనవన, చైత్రంబులు విష్ణుదేవుచారిత్రంబుల్. స్కం. 7. ప. 6

క. పరిభూతవ్యథనంబులు, నిరుపమసంసారజలధినిర్మథనంబుల్
నరకేసరికథనంబులు, పరిరక్షితదేవయక్షఫణిమిథునంబుల్. స్కం. 7. ప. 28

మీఁదిపద్యమునందలి యనుప్రాసంబులం గడపలిదానియందుఁ బ్రక్రమ విరోధం బున్నది.

శా. సూనుల్ శాంతగుణప్రధాను నతిసంశుద్ధాంచితజ్ఞాను స
జ్ఞానారణ్యకృశాను నంజలిపుటీసంభ్రాజమానున్ సదా
శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదనా
ధీనున్ ధిక్కరణంబు సేసి పలికెన్ దేవాహితుం డుగ్రతన్. స్కం. 7. ప. 256

పాదపాదంబునకు వేర్వేఱుగా నంత్యానుప్రాసంబు లున్నిటికిసుదాహరణము.

సీ. కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రు వసుధాకళత్రుఁ బావనచరిత్రు
సత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు నతపన్నగాకల్పు నాగతల్పుఁ
గౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు శ్రితజనపోషు సంచితవిశేషు
నీలనీరదకాయు నిర్జితదైతేయు ధృతపీతకౌశేయు నతవిధేయు

తే. నఖిలమహాగదవైద్యు వేదాంతవేద్యు, దివ్యమునిసన్నుతామోదుఁ దీర్ఘపాదు
జిష్ణు వరసద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ, జూడు దైతేయకులబాల సుభగలీల.
స్కం. 10. ఉ-భా. ప. 358

క. భూషణములు వాణికి నఘ, పేషణములు మృత్యుచిత్తభీషణములువ్యా
త్తోషణములు గల్యాణవి, శేషణములు హరిగుణోపచితభాషణముల్. స్కం. 1. ప. 46

క. అనుదినసంతోషణములు, జనితశ్రమతాపదుఃఖసంశోషణముల్
తనయులసంభాషణములు, జనకులకుం గర్ణయుగళసద్భూషణముల్. స్కం. 7. ప. 140

క. భూషణములు సెవులకు బుధ,తోషణము లనేకజన్మదురితౌఘవిని
శ్శోషణములు మంగళతర, ఘోషణములు గరుడగమనుగుణభాషణముల్.
స్కం. 10. పూ-భా. ప. 1683

పై మూఁడుపద్యములం దంత్యానుప్రాసంబులం బరికించునది. మఱియు నీక్రింది పద్యప్రాసములయందు నొక్కవిధముగ విన(బడుపదములఁ బ్రయోగించినాఁడు. దీనికి నిదర్శనములు.

క. శ్రీపంబులు ఖండితపసం, తాపంబులు గల్మషాంధతమసమహోద్య
ద్దీపంబులు పాషండదు, రాపంబులు విష్ణువందనాలాపంబుల్. స్కం. 1. ప. 445

క. పావనములు దురితలతా, లావనములు నిత్యమంగళప్రాభవసం
జీవనములు లక్ష్మీసం, భావనములు వాసుదేవపదసేవనముల్. స్కం. 1. ప. 446

క. పుట్టితి వజుతనువునఁ జే, పట్టితివి పురాణపురుషభజనము పదముల్
మెట్టితివి దిక్కులం దుది, ముట్టితివి మహాప్రబోధమున మునినాథా. స్కం. 1. ప. 91

చ. వెఱచినవాని దైన్యమున వేఁదుఱు నొందినవాని నిద్రమై
మఱచినవాని సౌఖ్యమున మద్యముఁ ద్రావినవాని భగ్నుఁడై
పఱచినవాని సాధుజడభావమువానిని గావుమంచు వా
చఱచినవానిఁ గామినులఁ జంపుట ధర్మము గాదు ఫల్గునా. స్కం. 1. ప. 155

క. ఉన్నారము సౌఖ్యంబున, విన్నారము నీప్రతాపవిక్రమకథలన్
మన్నారము ధనికులమై, కన్నారము నీపదాంఘ్రికమలములు హరీ. స్కం. 1. ప. 250

క. విన్నారమె యీచెలువముఁ, గన్నారమె యిట్టిశౌర్యగాంభీర్యంబుల్
మన్నార మింతకాలముఁ, గొన్నారమె యెన్నఁడైనఁ గూరిమి చిక్కన్.
స్కం. 10 ఉత్తరభా. ప. 211

క. గురువులు దమకును లోఁబడు, తెరువులు సెప్పెదరు విష్ణుదివ్యపదవికిం
దెరువులు సెప్పరు చీకటిఁ, బరువులు వెట్టంగ నేల బాలకులారా. స్కం. 7. ప. 246

క. తెం డెల్లపుస్తకంబులు, నిం డాచార్యునకు మరల నేకతమునకుం
రండు విశేషము సెప్పెదఁ, బొం డొల్లనివారు కర్మపుంజముపాలై. స్కం. 7. ప. 247

క. ఆడుదము మనము హరిరతిఁ, బాడుద మే ప్రొద్దు విష్ణుభద్రయశంబుల్
వీడుదము దనుజసంగతిఁ, గూడుదము ముకుందభక్తకోటిఁ సూటిన్. స్కం. 7. ప. 248

క. విత్తము సంసృతిపటలము, వృత్తము కామాదివైరివర్గంబుల నేఁ
జిత్తము చిత్తము హరికిని, జొత్తము నిర్వాణపదము శుభమగు మనకున్. స్కం. 7. ప. 249

ఉ. చంపుదుమే నిలింపులను జంకెల ఱంకెలఁ దాపసావలిం
బంపుదుమే కృతాంతకునిపాలికిఁ గ్రేపులతోడ గోవులం

ద్రుంపుదుమే ధరాసురులఁ దోలుదుమే నిగమంబులన్ విదా
రింపుదుమే వసుంధర హరింపుదుమే జననాథ పంపుమా. స్కం. 10. పూ-భా. ప. 170

ఇటులే నాచనసోమనాథుని హరివంశమందు

చ. కొలువఁగ నేర నిన్ను శతకోటివిభాకరతేజు డగ్గఱన్
బిలువఁగ నేర నిన్ను మునిబృందవివేకవిమర్శదూరునిన్
విలువఁగ నేర నిన్నుఁ బృథివీవియదంతరభిన్ను నేమిటన్
నిలువఁగదయ్య నాహృదయనీరజకర్ణికపై మహేశ్వరా.

చ. ఒరసిరి నిన్నుఁ దర్కనికషోపలధారల వన్నెఁ గాన రె
త్తరసిరి విశ్వముం గపిల యైనను నీదెస ముల్లు సూపఁగా
బెరసిరి బ్రహ్మముఖ్యు లగుపెద్దలు బచ్చులుఁబోలె నెల్లచో
నెరసిరిగాని ని న్నెఱుఁగ నేరరు నావశమే మహేశ్వరా. ఆశ్వా. 5. ప. 10

ఉ. నెయ్యము లేనిసంగతియు నిక్కము లేనివచోవిలాసమున్
వియ్యము లేనివైభవము విందులసందడి లేనిముంగిలిం
దియ్యము లేనిచాగమును ధీరత లేనియమాత్యకృత్యముం
గయ్యము లేనిశూరతయుఁ గైకొని యూరక మెచ్చవచ్చునే. ఆశ్వా. 5. ప. 27

ఇట్లే యెఱ్ఱాప్రెగ్గడహరివంశము-ఉత్తరభాగము.

క. క్షణమాత్రము చిత్రరణ, క్షణము ననుభవించి పిదపఁ గాళిపుఁ గమలే
క్షణుఁడు శిరశ్ఛేదవిచ, క్షణుఁ డై పీరజనయోగ్యగతులకు ననిచెన్. ఆశ్వా.

రెండేసిపదంబులకు నంత్యప్రాసనియమంబు వాటించుటయుఁ గలదు ఉదా:

సీ. దరదరవిందసుందరపత్త్రరుచిరాక్షు సలలితశ్రీవత్సకలితవక్షు
నీలనీరదనీలనీలోత్పలశ్యాము నలికులాకులమాలికాభిరాముఁ
గౌస్తుభరుచిరముక్తాహారయుతకంఠు యోగిమానసపంకజోపకంఠు
సతతప్రసన్నసస్మితవదనాంభోజు దినకరకోటిసందీప్తతేజు

తే. సలలితానర్ఘ్యరత్నకుండలకిరీట, హారకంకణకటకకేయూరముద్రి
కాతులాకోటిభూషు భక్తప్రపోషుఁ, గింకిణీయుతమేఖలాకీర్ణజఘను. స్కం. 3. ప. 922

సీ. జలధరదేహు నాజానుచతుర్బాహు సరసీరుహాక్షు విశాలవక్షుఁ
జారుగదాశంఖచక్రపద్మవిలాసుఁ గంఠకౌస్తుభమణికాంతిభాసుఁ
గమనీయకటిసూత్రకంకణకేయూరు శ్రీవత్సలాంఛనాంచితవిహారు
నురుకుండలప్రభాయుతకుంతలలలాటు వైదూర్యమణిగణవరకిరీటు

తే. బాలుఁ బూర్ణేందురుచిజాలు భక్తలోక, పాలు సుగుణాలవాలుఁ గృపావిశాలుఁ
జూచి తిలకించి పులకించి చోద్య మంది, యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ డుత్సహించె.
స్కం. 10. పూ-భా. ప. 112

సీ. ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ గరుణాలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ గామితమందారు సురుచిరలావణ్యు సురశరణ్యు

హార్యక్షనిభమధ్య నఖిలలోకారాధ్య ఘనచక్రహస్త జగత్ప్రశస్త
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ బన్నగశయను నబ్జాతనయను

తే. మకరకుండలసద్భూషు మంజుభాషు, నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు, విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు.

స్క. 10. ఉత్తరభా. ప. 979

ఇట్టియనుప్రాసములు ప్రాయికంబుగా నీతనికిఁ బూర్వమం దున్నకవులు విశేషించి ప్రయోగింపలేదు. కవిత్రయమువారియందు నెఱ్ఱాప్రగ్గడమాత్ర మించుక ప్రయోగించియున్నాఁడు నాచనసోమనాథుఁడు దనయుత్తరహరివంశము నందు భాస్కరాదులు రామాయణమునందు నీయలంకారము ననేకవిధములఁ జిత్రముగా నచ్చటచ్చటఁ బ్రయోగించి యున్నారు. వీరె యీతనికి మార్గదర్శకు లని తోఁచెడిని.

ఉత్తరహరివంశమునందు

సీ. అభ్రంకషం బైనయాలపోతు నితండు త్రుంచినాఁ డీతండు వెంచినాఁడు
సాధుసమ్మతముగా సామజంబు నితండు గాచినాఁ డీతండు ద్రోచినాఁడు
బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు
ఫణపరంపరతోడిపన్నగేంద్రు నితండు మెట్టినాఁ డీతండు సుట్టినాఁడు

తే. నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ, జూపఁ జెప్పంగఁ జెప్పంగఁ జూపఁగలిగె
ననుచుఁ గొనియాడుసంయమిజనుల కొదవె, రజతగిరిమీఁద హరిహరారాధనంబు.

ఆశ్వా. 2. పద్య. 180

సీ. సారసంబున లేవ నీరసంబునఁ జావఁ బద్మాసనుఁడు వీరిపాలఁ గనియె
రూపు గంటఁ జెలంగఁ జూపు మంట నలంగఁ బంచబాణుఁడు వీరిపాలఁ గనియె
వరములు వడయంగ శిరములు గెడయంగఁ బంక్తికంఠుఁడు వీరిపాలఁ గనియె
దేహరక్ష నటింప దేహశిక్ష ఘటింప బాణాసురుఁడు వీరిపాలఁ గనియెఁ

తే. గనియెఁ జిత్రంబులకు వీరు గలసి యుండి, మనుపఁ జెఱుపంగఁ జెఱుపంగ మనుప నేర్తు
రెల్లలోకంబులకు దైవ మేక మగుట, హరిహరాత్మక మెఱిఁగితి మనిరి సురలు.

ఆశ్వా. 2. పద్య. 181

మఱియు లాటానుప్రాసాదిశబ్దాలంకారములు నక్కడక్కడఁ గలవు. ఉదా:—

సీ. కమలాక్షు నర్చించుకరములు కరములు శ్రీనాథు వర్ణించుజిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచుచూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కుశిరము శిరము
విష్ణు నాకర్ణించువీనులు వీనులు మధువైరిఁ దగిలినమనము మనము
భగవంతు వలగొనుపదములు పదములు పురుషోత్తమునిమీఁదిబుద్ధి బుద్ధి

తే. దేవదేవునిఁ జింతించుదినము దినము, చక్రహస్తునిఁ బ్రకటించుచదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడిగురుఁడు గురుఁడు, తండ్రి హరిఁ జేరు మనియెడితండ్రి తండ్రి.

స్కం. 7. ప. 169

ఇట్లు ప్రాసంబు లనేకవిధంబులు కర్ణసుఖావహంబులుగ సముచితసరణిని ప్రయుక్తము లై యున్నవి.

మఱియు నచ్చతెనుఁగుపదములచేఁ బెక్కుపద్యములు మిక్కిలి సొంపుగాఁ గూర్పఁబడినవి. ఉదా:—

క. క్రొక్కారుమెఱుఁగుమేనులుఁ, గ్రిక్కిఱిసినచన్నుఁగవలు గ్రిస్సిననడుముల్
పిక్కటిలి యున్నతుఱుములుఁ, జక్కనివాఁపులును దివిజసతులకు నొప్పున్.

స్కం. 8. ప. 263

క. తొలుకారుమెఱుఁగుకైవడి, తళతళ మని మేను మెఱయ ధగధగ మనుచుం
గలుముల నీనెడుచూపులఁ, జెలువంబుల మొదలిటెంకి సిరి వుట్టె నృపా. స్కం. 8. ప. 865

సీ. పాలమున్నీటిలోపలిమీఁదిమీఁగడమీసిమిజిడ్డుఁ జేసి మేను వడసి
క్రొక్కారుమెఱుఁగులకొనలక్రొత్తళుకులమేనిచేఁ గలనిగ్గు మెఱుఁగు సేసి
నాఁటినాఁటికిఁ బ్రోదినవకంపుఁదీవలనుచుబోదనెయ్యంబు నూలుకొలిపి
క్రొవ్వారుకెందమ్మికొలఁకునఁ బ్రొద్దునఁ బొలసినవలపులఁ బ్రోదివెట్టి
తే. పసిఁడిచంపకదామంబు బాగుఁ గూర్చి, వాలుక్రొన్నెలచెలువున వాఁడిదీరి
జాణతనమునఁ జేతులజడ్డు విడిచి, నలువ యీకొమ్మ నొగిఁ జేసినాఁడు నేఁడు.

స్కం. 8. ప. 266

క. కెంపారెడునధరంబులు, జంపారెడినడుము సతికి శంపారుచులన్
సొంపారుమోముఁ గన్నులుఁ, బెంపారుచు నొప్పుఁగొప్పపిఱుఁదు గుచముల్.

స్కం. 8. ప. 267

కొన్నిచోట్ల మానసంబున కెంతయు సంతసంబు గల్పించువిధంబున సుకుమారశైలిం గూర్పఁబడి యీతనికవిత్వం బతిరమ్యం బై యున్నది. దీనికిఁ దార్కాణంబులుగా

సీ. కుప్పించి యెగసినఁ గుండలంబులకాంతి గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల వ్రేఁగున జగతి గదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచురయమునఁ బై నున్నపచ్చనిపటము జాఱ
నమ్మితి నాలావు నగుఁబాటు సేయకు మన్నింపు మని క్రీడి మరలఁ దిగువఁ
తే. కరికి లంఘించుసింహంబుకరణి మెఱసి, నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ, దెరలి చనుదెంచుదేవుండు దిక్కు నాకు.

స్కం. 1. ప. 222

సీ. చెలికాఁడ రమ్మని చీరు నన్నొకవేళ మన్నించు నొకవేళ మఱఁది యనుచు
బంధుభావంబునఁ బాటించు నొకవేళ దాత యై యొకవేళ ధనము లిచ్చు
మంత్రి యై యొకవేళ మంత్ర మాదేశించు బోధి యై యొకవేళ బుద్ధి సెప్పు
సారథ్య మొనరించుఁ జన విచ్చి యొకవేళఁ గ్రీడించు నొకవేళ గేలిసేయు

తే. నొక్కశేషవ్యాసనంబున నుండుఁ గన్నుఁ, తండ్రిసైవడిఁ జేసినతప్పుఁ గాచు
హస్తములు పట్టి పొత్తున నారగించు, మనుజవల్లభ మాధవుమఱపురాదు. స్కం. 1. ప. 369

శా. నాతంం జూడఁగఁ జోద్య మయ్యెడిఁగదా నాతండ్రి యీబుద్ధి డా
నీకుఁ లోపలఁ దోఁచెనో పరులు దుర్నీతుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ పలికిరో యీ దానవశ్రేణికిన్
వైకుంఠుండు గృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీ కేటికిన్. స్కం. 7. ప. 145

సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలుమధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగురాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కుకోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరకం బరుగునే సాంద్రనీహారములకు
తే. నంబుజోదరదివ్యపాదారవింద, చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు, వినుతగుణశీల మాటలు వేయునేల. స్కం. 7. ప. 150

భాషాంతరీకరణపద్ధతి.

పోతనామాత్యుఁడు సంస్కృతము నాంధ్రీకరించుచోఁ దత్తత్సందర్భాను గుణంబుగ వినువారికెంతయు నానందంబు గలిగించునట్లు కొన్నిచోట్ల మూలము ననుసరించియుఁ గొన్నియెడల శ్రీధరవ్యాఖ్య ననుసరించియుఁ గొన్నితావుల మూలమునకంటె నధికంబుగాఁ బెంచియు వర్ణనంబు లెక్కువ చేసియుఁ గొన్ని చోట్ల మూలవ్యాఖ్యలరెంటి ననుసరించియుఁ గొన్నిపట్టుల నింపు గానరాదేని వదలియు నిట్లు పలువిధంబుల రచనానైపుణిం జూపి యున్నాఁడు. మూలము ననుసరించి యుండుటకు నిదర్శనములు.

శ్లో. సత్త్వం రజ స్తమ ఇతి ప్రకృతే ర్గుణా స్తై ర్యుక్తః పరః పురుష ఏక ఇ హాస్య ధత్తే,
స్థిత్యాదయే హరివిరిఞ్చి హరేతిసంజ్ఞాః శ్రేయాంసి తత్ర ఖలు సత్త్వతనోర్నృణాంస్యుః
స్కం. 1. అ. 2. శ్లో. 24

పైశ్లోకమునకుఁ దెలుఁగు.

తరలము. పరమపూరుషుఁ డొక్కఁ డాఢ్యుఁడు పాలనోద్భవనాశముల్
సొరిదిఁ జేయ ముకుందపద్మజశూలిసంజ్ఞలఁ బ్రాకృత
స్ఫురితసత్త్వరజస్తమంబులఁ బొందు నందు శుభస్థితుల్
హరి చరాచరకోటి కిచ్చు ననంతసత్త్వనిరూఢుఁ డై. స్కం. 1. ప. 60

శ్లో. భూయా ననుగ్రహ అహో భవతా కృతో మే
దండ స్త్వయా మయి భృతో యదపి ప్రలబ్ధః,
న బ్రహ్మబంధుషు చ వాం భగవ న్నవజ్ఞా
తుభ్యం హరే శ్చ కుత ఏవ ధృతవ్రతేషు. స్కం. 4. అ. 7. శ్లో. 13

శ్లో. విద్యాతపో వ్రతధరాన్ముఖతస్తు విప్రా న్బ్రహ్మాత్మతత్త్వ మవితుం ప్రథమం త్వమస్రాక్
తద్బ్రాహ్మణాన్ పరమ సర్వవిపత్సు పాసి పాలః పశూనివ విభో ప్రగృహీతదండః.
స్కం. 4. అ. 7. శ్లో. 14

పై శ్లోకములకుఁ దెలుఁగుపద్యములు.

క. విను నీ కపరాధుఁడ నగు, నను దండించు టెగి దండనము గాదు మది
న్నను రక్షించుటగా మన,మునఁ దలఁతును దేవ యభవ పురహర రుద్రా.

స్కం. 4. ప. 159

సీ. అనఘాత్మ తగ నీవు నబ్జనాభుండును బరికింప బ్రాహ్మణాభాసు లైన
వారలయెడల నెవ్వలన నుపేక్షింప రఁట దృఢవ్రతచర్యు లైనవారి
యెడ నీ కుపేక్ష యెక్కడిది సర్గాదిని నామ్నాయసంప్రదాయప్రవర్త
నము నెఱింగించుట కమర విద్యాతపోవ్రతపరాయణు లైనబ్రాహ్మణులను
తే. వరుసఁ బుట్టించితివి కాన వారి నెపుడుఁ, గేల దండంబుఁ బూని గోపాలకుండు
బలసి గోవుల రక్షించుపగిది నీవు, నరసి రక్షించు చుందు గదయ్య రుద్ర.

స్కం. 4. ప. 160

శ్లో. యస్య భాసా సర్వ మిదం విభాతి సచరాచరమ్. స్కం. 10. అ. 13. శ్లో. 55
శ్లో. తతోఽతికుతుకో ద్వృత్య స్తిమితైకాదశేంద్రియః,
తద్ధామ్నాభూ దజ స్తూష్ణీం పూర్దేవ్యం తీవ పుత్రికా. స్కం. 10. అ. 13. శ్లో. 56
చ. వికరమేశు తేజమున నీసచరాచర మైనలోక ము
ద్దీపిత మయ్యె నట్టివిభు తేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా
నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం
డై పరమేష్ఠి మై మఱచె నప్పుడు చిత్రపురూపు కైవడిన్. స్కం. 10. పూ. 540
శ్లో. అమ్బామ్బ హే వధూః పుత్రా వీరం మార్హాథ శోచితుమ్,
రిపో రభిముఖే శ్లాఘ్యః శూరాణాం వధ ఈప్సితః. స్కం. 7. అ. 2. శ్లో. 20
శ్లో. భూతానా మిహ సంవాసః ప్రపాయామివ సువ్రతే,
దైవే నైకత్ర నీతానా మున్నీతానాం స్వకర్మభిః. స్కం. 7. అ. 2. శ్లో. 21
శా. నీరాగాంసవిష్టపాంథులక్రియన్ నిక్కంబు సంసారసం
చారుల్ వత్తురు గూడి విత్తురు సదాసంగంబు లే దొక్కచో
శూరుల్ పోయెడి త్రోవఁ బోయెను భవత్పూనుండు దల్లీ మహా
శూరుం డాతఁడు తద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్. స్కం. 7. ప. 38

ఈ క్రిందిశ్లోకములను నింపు నింపుటకై యెట్లు పెంచినాఁడో పరికించునది.

శ్లో. యతో న కశ్చి త్క్వచ కుత్ర విద్వాన్ దీన స్స్వ మాత్మాన మలం సమర్థః,
విమోచితుం కామదృశాం విహారక్రీడామృగో య న్నిగళో విసర్గః.

స్కం. 7. అ. 6. శ్లో. 25

శా. హేలాపావివిజృంభమాణమదగర్వాతీత దేహోల్లస
ద్బాలాలోకనశృంఖలానిచయసంబద్ధాత్ముఁ డై లేశమున్
వేలానిస్సరణంబు గానక మహావిద్వాంసుఁడుం గామినీ
హేలాకృష్టకురంగశాబక మగున్ హీనస్థితిన్ వింటిరే. స్కం. 7. ప. 215

శ్లో. హిరణ్యకశిపుః — ప్రహ్లాద ఉచ్యతాం తాత స్వధీతం కించి దుత్తమమ్,
కాలే నైతావ తాయుష్మన్ య దశిక్ష ద్గురో ర్భవాన్. స్కం. 7. అ. 5. శ్లో. 22

శ్లో. ప్రహ్లాదః — శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్,
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్. స్కం. 7. అ. 5. శ్లో. 23

శ్లో. ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తి శ్చే న్నవలక్షణా,
క్రియతే భగవ త్యద్ధా త న్మన్యేఽధీత ముత్తమమ్. స్కం. 7. అ. 5 శ్లో. 24

తెలుఁగున విస్తరింపఁబడి యెంతసొంపుగా వ్రాయఁబడినదో చూతమనది

శా. చోద్యం బయ్యెడి నింతకాల మరిగెన్ శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువు లేవెంటం బఠింపించిరో
విద్యాసార మెఱుంగఁ గోరెద భవద్విజ్ఞాతశాస్త్రంబులోఁ
బద్యం బొక్కటి సెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా. స్కం. 7. ప. 163

శా. నిన్నున్ మెచ్చరు నీతిపాఠమహిమన్ నీతోడిదైత్యార్భకుల్
గన్నారన్నియుఁ జెప్ప నేర్తురు గదా గ్రంథార్థముల్ దక్షులై
యన్నా యెన్నఁడు నీవు నీతివిదుఁడౌ యుంచున్ మహావాంఛతో
నున్నాఁడన్ ననుఁ గన్నతండ్రి భవదీయోత్కర్షముం జూపవే. స్కం. 7. ప. 164

క. చదివించిరి నను గురువులు, చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు, చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ. స్కం. 7. ప. 166

మ. తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిదిభక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా. స్కం. 7. ప. 167

శా. అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితులరిక్తవ్యర్థసంసారముల్. స్కం. 7. ప. 168

సీ. కమలాక్షు నర్చించుకరములు కరములు శ్రీనాథువర్ణించుజిహ్వ జిహ్వ

... ... ... ...

కుంభినీధవుఁ జెప్పెడిగురుఁడు గురుఁడు, తండ్రి హరిఁ జేరు మనియెడితండ్రి తండ్రి.
స్కం. 7. ప. 169

సీ. కంజాక్షునకుఁ గానికాయంబు కాయమే పవనగుంఫితచర్మభస్త్రి గాక
వైకుంఠుఁ బొగడనివక్త్రంబు వక్త్రమే ఢమఢమధ్వనితోడిఢక్క గాక
హరిపూజనము లేనిహస్తంబు హస్తమే తరుశాఖనిర్మితదర్వి గాక
కమలేశుఁ జూడనికన్నులు కన్నులే తనుకుడ్యజాలరంధ్రములు గాక
ఆ. చక్రిచింత లేనిజన్మంబు జన్మమే, తరళసలిలబుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేనివిబుధుండు విబుధుఁడే, పాదయుగముతోడిపశువు గాక. స్కం. 7. ప. 170

సీ. సంసారజీమూతసంఘంబు విచ్చునే చక్రిదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీలదావాగ్ను లాఱునే విష్ణుసేవామృతవృష్టి లేక
సర్వంకషాఘౌఘజలరాసు లింకునే హరిమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడఁగునే పద్మాక్షునుతిరవిప్రభలు లేక
తే. నిరుపమాపునరావృత్తినిష్కలంక, ముక్తినిధిఁ గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక, తామసగర్భునకునైన దానవేంద్ర. స్కం. 7. ప. 171

శ్లో. ఏతస్మిన్నంతరే విష్ణు స్సర్వోపాయవి దీశ్వరః,
యోషిద్రూప మనిర్దేశ్యం దధార పరమాద్భుతమ్. స్కం. 8. అ. 8. శ్లో. 40

శ్లో. ప్రేక్షణీయోత్పలశ్యామం సర్వావయవసుందరమ్,
సమానకర్ణాభరణం సుకపోలోన్నతాననమ్. స్కం. 8. అ. 8. శ్లో. 41

శ్లో. నవయౌవననిర్వృత్తస్తనభారకృశోదరమ్,
ముఖామోదానురక్తాళిఝంకారోద్విగ్నలోచనమ్. స్కం. 8. అ. 8. శ్లో. 42

శ్లో. బిభ్రత్స్వకేశభారేణ మాలా ముత్ఫుల్లమల్లికామ్,
సుగ్రీవకంఠాభరణం సుభుజాంగదభూషణమ్. స్కం. 8. అ. 8. శ్లో. 43

శ్లో. విరజాంబరసంవీతనితంబద్వీపశోభయా,
కాఞ్చ్యా ౖ కపోల్లసద్వల్గుచలచ్చరణనూపురమ్. స్కం. 8. అ. 8. శ్లో. 44

శ్లో. సవ్రీడస్మితవిక్షిప్తభ్రూవిలాసావలోకనైః,
దైత్యయూథపచేతస్సు కామ ముద్దీపయ న్ముహుః. స్కం. 8. అ. 8. శ్లో. 45

సీ. మెత్తనియడుగుల మెఱుఁగారుజానువు లరఁటికంబములదో యైనతొడలు
ఘన మగుజఘనంబుఁ గడులేఁతనడుమును బల్లవారుణకాంతిపాణియుగముఁ
గడుదొడ్డపాలిండ్లుఁ గంబుకంఠంబును బింబాధరముఁ జంద్రబింబముఖముఁ
దెలిగన్నుఁగవయును నలికుంతలంబులు బాలేందుసన్నిభఫాలతలము
తే. నమరఁ గుండలకేయూరహారకంక, ణాదులేపార మంజీరనాద మొప్ప
నల్లనవ్వులఁ బద్మదళాక్షుఁ డసుర, పతుల నడఁగింప నాఁడురూపంబుఁ దాల్చె.
స్కం. 8. ప. 301

సీ. పాలిండ్లపై నున్నపయ్యెద జాఱించు జాఱించి మెల్లన చక్క నొత్తుఁ
దళ్కుదళ్కనుగండఫలకంబు లాలయించు నొలయించి కెంగేల నుజ్జగించుఁ
గడుమెఱుంగులు వాఱుకడకన్ను లల్లార్చు నల్లార్చి ఱెప్పల నండ గొలుపు
నవరనిదరహాసచంద్రికఁ జిలికించుఁ జిలికించి కెమ్మోవిఁ జిక్కపఱచు
తే. దళితధమ్మిల్లకుసుమగంధమ్ము నెఱపుఁ, గంకణాదిఝణంకృతుల్ గడలుకొలుపు
నొడలికాంతులు పట్టు లే కులుకఁబాఱు, సన్నవలిపంపుఁబయ్యెద సౌకళింప.
స్కం. 8. ప. 303

శ్లో. శ్రీశుకః—ఏవం గజేంద్రముపవర్ణితనిర్విశేషం బ్రహ్మాదయో వివిధలింగభిదాభిమానాః,
నైతే యదోపసస్రుపు ర్నిఖిలాత్మకత్వా త్తత్రాఖిలామరమయో హరి రావిరాసీత్.
స్కం. 8. అ. 3. శ్లో. 30

శ్లో. తం తద్వ దార్త ముపలభ్య జగన్నివాసః స్తోత్రం నిశమ్య దివిజైస్సహ సంస్తువద్భిః,
ఛందోమయేన గరుడేన స ఊహ్యమానశ్చక్రాయుధోఽభ్యగమ దాశు యతో గజేంద్రః.
స్కం. 8. అ. 3 శ్లో. 31

శ్లో. సోఽన్తస్సరస్యురుబలేన గృహీత ఆర్తో దృష్ట్వా గరుత్మతి హరిం ఖ ఉపాత్తచక్రమ్,
ఉత్క్షిప్య సాంబుజకరం గిర మాహ కృచ్ఛ్రా న్నారాయణాఖిలగురో భగవ న్నమస్తే.
స్కం. 8. అ. 3. శ్లో. 32

శ్లో. తం వీక్ష్య పీడిత మజ స్సహ సావతీర్య సగ్రాహ మాశు సరసః కృప యోజ్జహార,
గ్రాహాద్విపాటితముఖా దరిణా గజేంద్రం సంపశ్యతాం హరిరమూముచదుస్రియాణామ్
స్కం. 8. అ. 3. శ్లో. 33

పై శ్లోకములను స్కం 8 93 వ పద్యము మొదలు 112 వ పద్యము దాఁక నత్యంతమనోహరంబుగ వ్రాయఁబడినది. వానియందు గొన్ని

ఆ. విశ్వమయత లేమి వినియు నూరక యుండి, రంబుజాసనాదు లడ్డపడక
విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు, భక్తియుతున కడ్డపడఁ దలంచె.
స్కం. 8. ప 94

మ. అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబుదా
పల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహి పాహి యనఁ గుయ్యాలించి సంరంభియై. స్కం. 8. ప. 95

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజప్రాణావనోత్సాహి యై. ప. 96

శా. తాటంకాచలనంబుతో భుజనటద్ధమ్మిల్లబంధంబుతో
శాటీముక్తకుచంబుతో నదృఢచంచత్కాంచితోఁ గీర్ణలా
లాటాలేపముతో మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ
గోటీందుప్రభతో నురోజభరసంతోచద్విలగ్నంబుతోన్. ప. 102

క. అడిగెద నని కడువడిఁ జను, నడిగినఁ దను మగుడ నుడుగఁ డని నెడ నుడుగున్
వెడవెడ చిడిముడి తడఁబడ, నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్. ప. 103

సీ. నిటలాలకము లంటనిపుర జుంజుమ్మని ముఖసరోజము నిండి ముసరుఁ దేంట్లు
నళులఁ జోపఁగ జిల్క లల్లనల్లన చేరి యోష్ఠబింబద్యుతు లొడిసి పట్టు
శుకములఁ దోలఁ జక్షుర్మీనములతో మందాకినీపాలికోరి మెసఁగు
మీనపంక్తుల దాఁట మెయిదీఁగతో రాయశంపాలతలు మింట సరణిగట్టు

ఆ. శంపలను జయింపఁ జక్రవాకంబులు, కుచయుగంబుఁ దాఁకి క్రొవ్వు సూపు
మెలఁత మొగిల్గుపిఱిఁది నెఱుఁగుఁదీవయుఁబోలె, జలదవర్ణువెనుకఁ జనెడునపుడు. 104

శ్లో. యజంతి యజ్ఞైః క్రతుభి ర్య మాదృతా భవంత ఆమ్నాయవిధానకోవిదాః,
స ఏష విష్ణు ర్వరదోఽస్తు వా పున ర్దాస్యా మ్యముష్మై క్షితి మీప్సితాం మునే.
స్కం. 8. అ. 20. శ్లో. 11

శ్లో. య ద ప్యసౌ పధర్మేణ మాం బధ్నీయా దనాగసమ్,
తథా ప్యేనం న హింసిష్యే ధృత బ్రహ్మతనుం హరిమ్. స్కం. 8. అ. 20. శ్లో. 12

ఈ శ్లోకంబులకు నెంతసొంపుగాఁ బెంచి వ్రాసినాఁడో కనుంగొనునది

క. ఉడుగని క్రతువుల వ్రతములఁ, బొడగనఁ జనునట్టిపొడవు పొడవునఁ గుఱు చై
యడిగెడి నఁట నను బోఁటికి, నిడరా దె మహానుభావ యిష్టార్థంబుల్. స్కం. 8. ప. 591

శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందుకరంబు క్రిందగుట మీఁ దై నాకరం బుంట మేల్
గాదే రాజ్యము గీజ్యముల్ సతతమే కాయంబు నాపాయమే. స్కం. 8. ప. 592

మ. నిరయం బైన నిబంధ మైన ధరణీనిర్మూలనం బైన దు
ర్మరణం బైనఁ గులాంత మైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁ డైనన్ హరి యైన నీరజభవుం డభ్యాగతుం డైన నాఁ
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య వే యేటికిన్. స్కం. 8. ప. 593

ఆ. నొడివినంతవట్టు నుసలక యిచ్చుచో, నేల కట్టు విష్ణుఁ డేటిమాట
కట్టెనేనిఁ దాన కరుణించి విడుమను, విడువకుండ నిమ్ము విమలచరిత. స్కం. 8. ప. 594

క. మేరువు దలక్రిం దైనను, బారావారంబు లింకఁ బాఱిన లోలో
ధారుణి రజ మై పోయినఁ, దారాధ్వము బద్ధ మైనఁ దప్పకయిత్తున్. స్కం. 8. ప. 595

మత్తకోకిలము. ఎన్నఁడుం బరు వేఁడఁ బోఁ డఁట యేకలుం డఁట కన్నవా
రన్నదమ్ములు నైన లేరఁట యన్నివిద్యలమూలగో
ష్ఠి న్నెఱింగిన ప్రోడగు జ్జఁట చేఁతు లొగ్గి వసింప నీ
చిన్నపాపని ద్రోసి పుచ్చఁగఁ జిత్త మొల్లదు సత్తమా. స్కం. 8. ప. 596

శ్లో. ఏకాయనోఽసౌ ద్విఫల స్త్రిమూల శ్చతూరసః పంచవిధ ష్షడాత్మా,
స ప్తత్వ గష్టవిటపో నవాక్షో దశచ్ఛదో ద్విఖగో హ్యాదివృక్షః.
స్కం. 10. అ. 2. శ్లో. 29

శ్లో. త్వ మేక ఏ వాస్య సతః ప్రసూతి స్త్వం సన్నిధానం త్వ మనుగ్రహశ్చ,
త్వన్మాయయా సంవృతచేతస స్త్వాం పశ్యంతి నానా న విపశ్చితో యే.
స్కం. 10. అ. 2. శ్లో. 30

సీ. ప్రకృతి యొక్కటి పాదు ఫలములు సుఖదుఃఖములు రెండు గుణములు మూఁడు వేళ్లు
తగురసంబులు నాల్గు ధర్మార్థముఖరంబు లెఱిఁగెడివిధము లై దింద్రియంబు
లాఱు స్వభావంబు లాశోకమోహాదు లూర్ములు ధాతువు లొక్కయేడు
పైపొర లెనిమిది ప్రంగలు భూతంబు లైదు బుద్ధియు మనోహంకృతులును

తే. రంధ్రములు దొమ్మిదియుఁ గోటరములు ప్రాణ, పత్త్రదశకంబు జీవేశపక్షియుగముఁ
గలుగుసంసారవృక్షంబు గలుగఁ జేయఁ, గావ నడఁగింప రాజ వొక్కరుఁడ వీవ.
స్కం. 10. పూ. ప. 91

శ్లో. దిశః ప్రసేదు ర్గగనం నిర్మలోడుగణోదయమ్,
మహీమంగళభూయిష్ఠపురగ్రామవ్రజాకరా. స్కం. 10. అ. 3. శ్లో. 2

శ్లో. నద్యః ప్రసన్నసలిలా హ్రదా జలరుహశ్రియః,
ద్విజాలికులసన్నాదస్తబకా వనరాజయః. స్కం. 10. అ. 3. శ్లో. 3

శ్లో. వవౌ వాయు స్సుఖస్పర్శః పుణ్యగంధవహ శ్శుచిః,
అగ్నయశ్చ ద్విజాతీనాం శాంతా స్తత్ర సమేధితాః. స్కం. 10. అ. 3. శ్లో. 4

శ్లో. మనాం స్యాసన్ ప్రసన్నాని సాధూనా మసురద్రుహామ్,
జాయమానే జనే తస్మి న్నేదు ర్దుందుభయో దివి. స్కం. 10. అ. 3. శ్లో. 5

సీ. స్వచ్ఛంబు లై పొంగె జలరాసు లేడును గలఘోషణముల మేఘంబు లుఱిమె
గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె దిక్కులు మిక్కిలి తెలివిఁ దాల్చెఁ
గమ్మని చల్లనిగాలి మెల్లన వీచె హోమానలంబు సెన్నొంది వెలిఁగెఁ
గొలఁకులు కమలాళికులము లై సిరినొప్పెఁ బ్రవిమలతోయ లై పాఱె నదులు
తే. వరపురగ్రామఘోష లై వసుధ యొప్పె, విహగరవపుష్పఫలముల వెలసె వనము
లలరువానలు గురిసి రయ్యమరవరులు, దేవదేవుని దేవకీదేవి గనఁగ.
స్కం. 10. పూ. ప. 106

శ్లో. కాలేన వ్రజతా తాత గోకులే రామకేశవౌ,
జానుభ్యాం సహ పాణిభ్యాం రమమాణౌ విజహ్రతుః. స్కం. 10. అ. 8. శ్లో. 22 మొదలు
శ్లో. గోప్యః కదాచన పృథక్పృథగ్ గూహ్యకృష్ణ మేత్యైకదైవ గదితుం ప్రసృతా స్తదాగః,
దృష్ట్వాతదన్యథ తమేవ నిజా నదృష్ట్వా సర్వాశ్చతా నివవృతుః స్వగృహాన్ సలజ్జాః.
స్కం. 10 అ. 8. శ్లో. 33 దాఁక కల

12 శ్లోకములకు మిక్కిలివిపులముగా నెంతయు మనోజ్ఞంబగునట్లు కల్పించి
46 పద్యములు వ్రాసియున్నాఁడు. వానియందుఁ గొన్ని యిటఁ దెల్పెద:—

క. తడ వాడిరి బలకృష్ణులు, దడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్
దడ వాడి రరులు భయమునఁ, దడ వాడిరి మంతనమునఁ దపసులు వేడ్కన్.
స్కం. 10. పూ. ప. 290

సీ. తనువున నంటినధరణీపరాగంబు పూసిననెఱిభూతిపూఁత గాఁగ
ముందఱ వెలుఁగొందుముక్తాలలామంబు తొగలసంగడికాని తునుక గాఁగ
ఫాలభాగంబుపైఁ బరఁగుకావిరిబొట్టు కాముని గెల్చినకన్ను గాఁగఁ
గంఠమాలికలోని ఘననీలరత్నంబు గమనీయమగు మెడకప్పు గాఁగ
ఆ. హారవల్లు లురగహారవల్లులు గాఁగ, బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివునిపగిది నొప్పె శివునికిఁ దనకును, వేఱు లేమిఁ దెల్ప వెలయునట్లు. ప. 297

సీ. గోవల్లభుండ నేను గోవులు మీరని వడి ఱంకె వైచుచు వంగి చూడు
రాజ నే భటులు మీరలు రండు రండని ప్రాభవంబునఁ బెక్కు పసులు వనుచు
నేఁ దస్కరుండ మీ రింటివారని నిద్ర వుచ్చి సొమ్ములు గొనిపోయి డాఁగు
నే సూత్రధారి మీ రిందఱు బహురూపు లని చెలంగుచు నాట లాడఁ బెట్టు

తే. మూల లుఱుకును డాఁగిలిమూఁత లాడు. నుయ్యెలల నూఁగుఁ జేబంతు లూనర వైచు
జారచోరులజాడలఁ జాల నిగుడు, శౌరి బాలురతో నాడుసమయమందు. ప. 305

క. ఆడం జని వీరలపెరుఁ, గోడక నీసుతుఁడు ద్రావి యొకయించుక తాఁ
గోడలిమూఁతిం జరిమినఁ, గోడలు మ్రుచ్చనుచు నత్త గొట్టె లతాంగీ. ప. 311

క. వేలుపులటె నాకంటెను, వేలుపు మఱి యెవ్వఁ డనుచు వికవిక నగి మా
వేలుపులగోడపై నో, హేలావతి నీతనూజుఁ డెంగిలిఁ జేసెన్. ప. 313

క. తెఱవ యొకతె నిద్రింపఁగ, నెఱిఁ గట్టినవలువ వీడ్చి నేటగు తేలుం
గఱపించి నీకుమారుఁడు, వెఱచుచు నది పఱవ నగియె విహితమె సాధ్వీ. ప. 324

సీ. కలకంఠి మావాడ గరితల మెల్ల నీపట్టి రాఁ గలఁ డని పాలు పెరుఁగు
లిండ్లలోపల నిడి యే మెల్లఁ దనత్రోవఁ జూచుచో నెప్పుడు సొచ్చినాఁడో
తలుపులముద్రలుఁ దాళంబులును బెట్టి యున్నచందంబున నున్న వరయ
నొకయింటిలో నాడు నొకయింటిలోఁ బాడు నొకయింటిలో నవ్వు నొకటఁ దిట్టు

ఆ. నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ, పక్షిఘోషణములు పరఁగఁజేయు
నిట్లు నేసి వెనుక నెక్కడఁ బోవునో, కానరాఁడు రిత్తకడవ లుండు. ప. 327

క. ఓయమ్మ నీకుమారుఁడు, మాయిండ్లను బాలుఁ బెరుఁగు మననీఁ డమ్మా
పోయెద మెక్కడికైనను, మాయన్నలసురభు లాన మంజులవాణీ. ప. 329

శ్లో. అంతర్హితే భగవతి సహసైవ వ్రజాంగనాః,
అతప్యం స్త మచక్షాణాః కరిణ్య ఇవ యూథపమ్. శ్లో. 1

శ్లో. గత్యానురాగస్మితవిభ్రమేక్షితై ర్మనోరమాలాపవిహారవిభ్రమైః,
ఆక్షిప్తచిత్తాః ప్రమదా రమాపతే స్తాస్తా విచేష్టా జగృహు స్తదాత్మికాః. శ్లో. 2

... ... ... ... ...

శ్లో. పునః పులిన మాగత్య కాళింద్యాః కృష్ణభావితాః,
సమవేతా జగుః కృష్ణం తదాగమనకాంక్షితాః. స్కం. 10. అ. 30. శ్లో. 46

మీఁదియధ్యాయములోని 46 శ్లోకములను 1006 మొదలు 1080 దాఁకఁ బద్యములు మిక్కిలి హృద్యంబులుగా రచియింపఁబడినవి. అందుఁ గొన్ని యిచ్చట నుదాహరించెద.

సీ. పున్నాగ కానవే పున్నాగవందితుఁ దిలకంబ కానవే తిలకనిటలు
ఘనసార కానవే ఘనసారశోభితు బంధూక కానవే బంధుమిత్రు
మన్మథ కానవే మన్మథాకారుని వంశంబ కానవే వంశధరునిఁ
జందన కానవే చందనశీతలుఁ గుందంబ కానవే కుందరదను

తే. నింద్రభూజమ కానవే యింద్రనిభవు, గువలవృక్షమ కానవే కువలయేశుఁ
బ్రియకపాదప కానవే ప్రియవిహారు, ననుచుఁ గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు.
స్కం. 10. పూ. ప. 1008

(మీఁదిపద్యము నన్నయభట్టు రచియించినభారత మారణ్యపర్వము ద్వితీయాశ్వాసములోని యీక్రిందిపద్యము ననుసరించునట్లున్నది.

సీ. సహకార మత్ప్రియసహకారుఁ బున్నాగ పున్నాగుఁ దిలక భూభువనతిలకుఁ
జందన బుధహరిచందనుఁ బుష్పితాశోక సుహృజ్జనశోకదమను
వకుళ కులైకదీపకు విభీతక భయభీతార్తిహరు నలుఁ బ్రీతిలోఁ
గానరే కానరే కాన లోకోత్తరు నని మ్రానిమ్రానికి నరిగి యరిగి

ఆ. యడుగు నడుగు లెండవడిఁ బురపురఁ బొక్కి, నిర్ఝరాంతరముల నిలుచుఁ బొలుచుఁ
దరుల గిరులయెడల నరుగుహాంతరములఁ, దొంగి తొంగి చూచుఁ బోయబాక్షి. ప. 49)

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడుమోమువాఁ డొకఁడు చెల్వలమానధనంబుఁ దెచ్చెనో
మల్లియలార మీపొదలమాటున లేఁడు గదమ్మ చెప్పరే. స్కం. పూ. ప. 1010

సీ. మానినీమన్మథు మాధవుఁ గానరే సలలితోదారవత్సకములార
సలలితోదారవత్సకవైరిఁ గానరే సుందరోన్నతలతార్జునములార
సుందరోన్నతలతార్జునభంజుఁ గానరే ఘనతరలసదశోకంబులార
ఘనతరలసదశోకస్ఫూర్తిఁ గానరే నవ్యరుచిరకాంచనంబులార

ఆ. నవ్యరుచిరకాంచనకిరీటుఁ గానరే, గహనపదవికురవకంబులార
గహనపదవికురవకనివాసిఁ గానరే, గణికలార చారుగణికలార. ప. 1012

సీ. అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ బాటలీతరులార పట్టరమ్మ
హేలావతులఁ గృష్ణ యేల పాసితి వని మైలేయలతలార యడుగరమ్మ
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడుగదా చూతమంజరులార చూడరమ్మ
మానినీమదనుతో మారాక యెఱిఁగించి మాధవీలతలార మనుపరమ్మ

ఆ. జాతిసతులఁ బాయ నీతియే హరి కని, జాతులార దిశలఁ జాటరమ్మ
కదళులార పోయి కదలించి శిక్షింప, నాతుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ. ప. 1013

సీ. పూతన నై యొక్కపొలఁతి చరింపఁగ శౌరి నై యొకకాంతచన్ను గుడుచు
బాలుఁ డై యొకభామ పాలకు నేడ్చుచో బండి నే ననుతేమఁ బాఱఁదన్ను
సుడిగాలి నని యొక్కసుందరి గొనిపోవ హరి నని వర్తించు నబ్జముఖియు
బకుఁడ నే నని యొక్కపడఁతి సంరంభింపఁ బద్మాక్షుఁ డనుకొమ్మ పరిభవించు

ఆ. నెలమి రామకృష్ణు లింతు లిద్దఱు గాఁగ, గోపవత్సగణము గొంద ఱగుదు
రసురవైరి ననుచు నబల యొక్కతె చీరుఁ, బసుల మసెడిసతుల భరతముఖ్య. ప. 1019

సీ. కొమ్మకుఁ బువ్వులు గోసినాఁ డిక్కడ మొనసి పాదాగ్రంబు మోపినాఁడు
సతి నెత్తుకొని పేడ్క జరిగినాఁ డిక్కడఁ దృణములోఁ దోఁపదు తెఱవజాడ

ప్రియకు ధమ్మిల్లంబు వెట్టినాఁ డిక్కడఁ గూర్చున్నచోటిదె కొమరుమిగులు
నింతికిఁ గెమ్మోవి యిచ్చినాఁ డిక్కడ వెలఁది నిక్కినగతి విశద మయ్యె

ఆ. సుదతితోడ నీరు సొచ్చినాఁ డిక్కడఁ, జొచ్చి తా వెడలినచోటు లమరెఁ
దరుణిఁ గాముకేళిఁ దనిపినాఁ డిక్కడ, సనఁగి పెనఁగి యున్నయంద మొప్పె. ప. 1026

సీ. ఈచరణంబులే యిందునిభానన సనకాదిమునియోగసరణి నొప్పు
నీపాదతలములే యెలనాఁగ శ్రుతిపథసీమంతవీథులఁ జెన్నుమిగులు
నీపదాబ్జంబులే యిభకులోత్తమయాన పాలేటిరాచూలిపట్టుఁగొమ్మ
లీసుందరాంఘ్రులే యిందీవరేక్షణ ముక్తికాంతామనోమోహనంబు

ఆ. లీయడుగులరజమె యింతి బ్రహ్మేశాది, దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు
రనుచుఁ గొంద ఱబల లబ్జాక్షుఁ డేఁగిన, క్రమముఁ గనియు నతనిఁ గానరైరి. ప. 1029

సీ. ఈపొదరింటిలో నిందాఁకఁ గృష్ణుండు నాతోడ మన్మథనటన మాడె
నిన్యోల మగుచోట నిందాఁకఁ జెలువుండు గాఢంబుగా నన్నుఁ గౌఁగిలించె
నీమహీజమునీడ నిందాఁక సుభగుండు జిట్టంటుచేఁతల సిగ్గు గొనియె
నీపుష్పలతపొంత నిందాఁక నియితుండు నను డాసి యధరపానంబు సేసె

ఆ. నీప్రసూనవేది నిందాఁక రమణుండు, గుసుమదామములను గొప్పుఁ దీర్చె
ననుచుఁ గొంద ఱతివ లంభోజనయనుని, పూర్వలీలఁ దలఁచి పొగడి రధిప. ప. 1033

శ్లో. విషజలాశయా ద్వ్యాళరాక్షసా ద్వర్షమారుతా ద్వైద్యుతానలాత్,
వృషమయాత్మజా ద్విశ్వతోభయా దృషభ తే వయం రక్షితా ముహుః.
స్కం. 10. అ. 31. శ్లో. 3

ఆ. విషజలంబువలన విషధరదానవు, వలన ఱాలవానవలన వహ్ని
వలన నున్నవానివలనను రక్షించి, కుసుమశరుని బారిఁ గూల్పఁ దగునె. ప. 1038

శ్లో. విరచితాభయం వృష్ణిధుర్య తే శరణ మీయుషాం సంసృతే ర్భయాత్,
కరసరోరుహం కాంత కామదం శిరసి ధేహి న శ్శ్రీకరగ్రహమ్. స్కం. 10. అ. 31. శ్లో. 5

ఆ. చరణసేవకులకు సంసారభయమును, బాపి శ్రీకరంబు పట్టు గలిగి
కామదాయి యయినకరసరోజంబు మా, మస్తకముల నునిచి మనుపు మీశ. ప. 1040

శ్లో. దినపరిక్షయే నీలకుంతలై ర్వనరుహాననం బిభ్ర దావృతం,
ఘనరజస్వలం దర్శయన్ ముహు ర్మనసి న స్స్మరం వీర యచ్ఛసి.
స్కం. 10. అ. 31. శ్లో. 12

ఉ. మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడి వచ్చి గోష్పద
ప్రాపితధూళిధూసరితభాసితకుంతల మై సరోరుహో
ద్దీపిత మైననీమొగము ధీరజనోత్తమ మాకు వేడ్కతోఁ
జూపి మనంబులన్ మరునిఁ జూపుదు గాదె క్రమక్రమంబునన్. ప. 1047

శ్లో. శ్రీశుకః.—రా జాసీ ద్భీష్మకో నామ విదర్భాధిపతి ర్మహాన్,
తస్య పఞ్చాభవన్ పుత్రాః కన్యైకా చ వరాననా. స్కం. 10. అ. 52. శ్లో. 21

... ... ... ... ...

బ్రాహ్మణః—ఇత్యేతే గుహ్యసందేశా యదుదేవ మయాహృతాః,
విమృశ్య కృత్యం యచ్చాత్ర క్రియతాం తదనంతరమ్. స్కం. అ. 52. శ్లో. 46

మీఁది యిరువదియాఱు శ్లోకములకు పీనాల విందుగాఁ జిత్రకల్పనలతోఁ బద్యంబులు వ్రాయఁబడి యున్నవి. చూడుఁడు

సీ. పేర్వేర బొమ్మలపెండ్లిండ్లు సేయుచు సబలలతోడ వియ్యంబు లందు
గుజ్జెనగూళ్లను గొమరొప్ప వండించి చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱసి
రమణీయమందిరారామదేశంబులఁ బువ్వుఁదీఁగెలకును బ్రోదివెట్టు
సదమలమణిమయసౌధభాగంబుల లీలతో భర్మడోలికల నూఁగు
తే. బాలికలతోడఁ జెలరేఁగి బంతు లాడు, శారికాకీరపంక్తికిఁ జదువు సెప్పు
బర్హిసంఘములకు మురిపములు గఱపు, మదమరాళంబులకుఁ జూపు మందగతులు. ప. 1688

సీ. దేవకీసుతుకోర్కి తీఁగెలు వీడంగ వెలఁదికి మైదీఁగ వీడఁ దొడఁగెఁ
గమలనాభునిచిత్తకమలంబు వికసింపఁ గాంతి నింతికి ముఖకమల మొప్పె
మధువిరోధికి లోన మదనాగ్ని పొడగూపఁ బొలఁతికిఁ జనుదోయి పొడవుసూపె
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ జలజాక్షిమధ్యంబు సన్నమయ్యె
ఆ. హరికిఁ బ్రేమబంధ మధికంబు గాఁ గేశ, బంధ మధిక మగుచు బాల కమరెఁ
బద్మనయనువలనఁ బ్రమదంబు నిండార, నెలఁత యౌవనంబు నిండి యుండె. ప. 1690

సీ. ఏనీగుణములు గర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు దీఱిపోవు
నేనీశుభాకార మీక్షింపఁ గన్నుల కఖిలార్థలాభంబు గలుగుచుండు
నేనీచరణసేవ లెప్రొద్దుఁ జేసిన భువనోన్నతత్వంబుఁ బొందఁ గలుగు
నేనీలసన్నామ మెప్రొద్దు భక్తితోఁ దడవిన బంధసంతతులు వాయు
తే. నట్టినీయందు నాచిత్త మనవరతము, నచ్చియున్నది నీయాన నానలేదు
కరుణఁ జూడుము కంసారి ఖలవిదారి, శ్రీయుతాకార మానినీచిత్తచోర. ప. 1702

సీ. లోపలిసౌధంబులోన వర్తింపంగఁ దే వచ్చునే నిన్నుఁ దెత్తునేనిఁ
గావలివారలఁ గలబంధువులఁ జంపి కాని తేరాదు పంతము లనయము
భావించి లేని నుపాయంబు సెప్పెద నాలింపు కులదేవయాత్రఁ జేసి
నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్కఁ బెండ్లికి మునుపడఁ బెండ్లికూఁతు
తే. నెలమి మావారుఁ బంపుదు రేను నట్లు, పురము వెలువడి యేతెంచి భూతనాథు
సతికి మ్రొక్కంగ నీవు నాసమయమందు, వచ్చి కొనిపొమ్ము నన్ను నవార్యచరిత. ప. 1707

సీ. ప్రాణేశ నీమంజుభాషలు వినలేనికర్ణరంధ్రంబులకలిమి యేల
పురుషరత్నమ నీవు భోగింపఁగా లేనితనులతవలనిసౌందర్య మేల
భువనమోహన నిన్నుఁ బొడగానఁగా లేనిచక్షురింద్రియములసత్త్వ మేల
దయిత నీయధరామృతం బానఁగా లేనిజిహ్వకు ఫలరససిద్ధి యేల
ఆ. నీరజాతనయన నీవనమాలికా, గంధ మబ్బ లేనిఘ్రాణ మేల
ధన్యచరిత నీకు దాస్యంబు సేయని, జన్మ మేల యెన్ని జన్మములకు. ప. 1709

సీ. పల్లవవైభవాస్పదములు పదములు గనకరంభాతిరస్కారు లూరు
లరుణప్రభామనోహరములు గరములు గంబుసౌందర్యమంగళము గళము
మహితభావాభావమధ్యంబు మధ్యంబు చక్షురుత్సవదాయి చన్నుదోయి
పరిహసితార్ధేందుపటలంబు నిటలంబు జితమత్తమధుకరశ్రేణి వేణి

ఆ. భావజాశుగముల ప్రాపులు చూపును, కుసుమశరునివింటికోవలు బొమలు
చిత్తతోషణములు చెలువభాషణములు, జలజనయనముఖము చంద్రసఖము. ప. 1711

ఉ. ఆయెలనాఁగ నీకుఁ దగు నంగనకుం దగు దీవు మాయుపా
ధ్యాయులయాన పెండ్లి యగుఁ దప్పదు జాడ్యము లేల నీవు నీ
తోయమువారిఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తుగాని వి
చ్చేయుము శత్రులన్ సుఖము సేయుము సేయుము శోభనం బిలన్. ప. 1712

శ్లో. తం విలోక్యాచ్యుతో దూరాత్ప్రియాపర్యంక మాస్థితః,
సహసోత్థాయ చాభ్యేత్య దోర్భ్యాం పర్యగ్రహీన్ముదా. స్కం. 10. అ. 80. శ్లో. 18

పై శ్లోకమునకుఁ దెనుఁగున నెంతవిపులముగా వ్రాసియున్నాఁడో చూచునది

మ. కని డాయం జనునంతఁ గృష్ణుఁడు దళత్కంజాక్షుఁ డప్పేదవి
ప్రుని నశ్రాంతదరిద్రపీడితుఁ గృశీభూతాంగు జీర్ణాంబరున్
ఘనతృష్ణాతురచిత్తు హాస్యనిలయున్ ఖండోత్తరీయుం గుచే
లుని నల్లంతనె చూచి సంభ్రమవిలోలుం డై దిగెం దల్పమున్. స్కం. 10. 980

క. కర మర్థి నెదురుగాఁ జని, పరిరంభణ మాచరించి బంధుస్నేహ
స్ఫురణం దోడ్తెచ్చి సమా, దరమునఁ గూర్చుండఁ బెట్టెఁ దనతల్పమునన్. స్కం.10.981

శ్లో. అపి న స్స్మర్యతే బ్రహ్మ న్వృత్తం నివసతాం గురౌ,
గురుదారై శ్చోదితానా మింధనాయ వనే క్వచిత్. స్కం. 10. అ. 80. శ్లో. 35

శ్లో. ప్రవిష్టానాం మహారణ్య మపర్తౌ సుమహా ద్ద్విజ,
వాతవర్ష మభూ త్తీవ్రం నిష్ఠురా స్తనయిత్నవః. స్కం. 10. అ. 70. శ్లో. 36

శ్లో. సూర్య శ్చాస్తంగత స్తావ త్తమసా చావృతా దిశః,
నిమ్నం కూలం జలమయం న ప్రాజ్ఞాయత కించన. స్కం. 10. అ. 80. శ్లో. 37

శ్లో. వయం భృశం తత్ర మహానిలాంబుభి ర్నిహన్యమానా ముహు రంబుసంప్లవే,
దిశో విదంతోఽథ పరస్పరం వనే గృహీతహస్తాః పరిబభ్రి మాతురాః.
స్కం. 10. అ. 80. శ్లో. 38

శ్లో. ఏత ద్విదిత్వా ఉదితే రవౌ సాందీపని ర్గురుః,
అన్వేషమాణో న శ్శిష్యా నాచార్యోఽపశ్య దాతురాన్. స్కం. 10. అ. 80. శ్లో. 39

పై శ్లోకములవిషయ మెంతవిరివిగా వర్ణింపఁబడినదో కనుంగొనునది.

సీ. ఘుమఘుమారావసంకులఘోరజీమూతపటలసంఛన్నాభ్రభాగ మగుచుఁ
జటులఝంఝానిలోత్కటసముద్ధూతనానావిధజంతుసంతాన మగుచుఁ
జండదిగ్వేదండతుండనిభాఖండవారిధారాపూర్ణవసుధ యగుచు
విద్యోతమానోగ్రఖద్యోతకిరణజిద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు

దనునియతిం జేసి కాదు. కావుననే యక్కడక్కడ రెంటిని గలిపియున్నాఁడు ఈయభిప్రాయమే సూచించునట్లు కాకునూరి యప్పకవి దనగ్రంథమందు

ఉ. బమ్మెరపోతరాజకృతభాగవతంబు సలక్షణంబు గా
కిమ్మహి నేమిటం గొదవ యెంతయు నారసి చూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలిసి ప్రాసము లైనకతంబునం గదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లరు మాని యుదాహరింపఁగన్.

అని యుదాహరించి యున్నాఁడు ఇట్లు లఘురేఫములు గలసి యుండుటకు నెన్ని యే నుదాహరణములు గలవు కలిపి యుండుటకుఁ గొన్ని పద్యముల నిం దుదాహరించెద.

చ. హరిఁ బరమాత్ము నచ్యుతు ననంతునిఁ జిత్తములం దలంచి సు
స్థిరత వివేకసౌఖ్యములఁ జెందినధీనిధు లన్యకృత్యము
ల్మఱచియుఁ జేయ నొల్లరు తలంచిన నట్టిద యా సురేంద్రుఁడుం
బరువడి నుయ్యి ద్రవ్వునె పిపాసితుఁడై సలిలాభిలాషతన్. స్కం. 2. ప. 209

చ. ఉరువర వేణుజానలవిసృష్టమహోటపము డిక్కఁ బాండుభూ
వరధృతరాష్ట్రసూను లనివార్యనిరూఢి విరోధ మెత్తి యొం
డొరుల జయింపఁ గోరి కదనోర్విఁ గురుక్షితిపాలముఖ్యు లం
దఱు మృతు లౌటయున్ విని ఘనంబుగ శోకనిమగ్నచిత్తుఁడై. స్కం. 3. ప. 43

క. మఱునాఁడు రేపకడ భా,సురపుణ్యుఁడు ఘనుఁడు మధునిషూదనచరణ
స్మరణక్రీడాకలితుఁడు, దరియించెం గలుషగహనదహనన్ యమునన్. స్కం. 3. ప. 170

క. తెఱఁగొప్ప నఖిలవిశ్వముఁ, బురుషోత్తముఁ మాయచేతఁ బుట్టుం బెరుఁగున్
విరతిం బొందుచు నుండుం, గరమర్థిన్ భూతభావికాలములందున్. స్కం. 3. ప. 43

మ. చిరభాగ్యోదయ దేవదేవ లలితశ్రీవత్సలక్ష్మాంగ యీ
పరవిప్రానుపదైకపుణ్యరజమే వర్ణింప నీమేని కా
భరణం బంటివి సర్వలోకులకు విప్రశ్రేణిమాహాత్మ్య మీ
వెఱుఁగం జెప్పుటకై ధరించితిగదా యెన్నం బవిత్రాకృతిన్. స్కం. 3. ప. 574

క. నెఱి నట్టిజలజభవునకుఁ, గర మంతఃకరణగాత్రకము లై పరుసం
బరఁగిన బ్రహ్మక్షత్త్రము, లరయ రమాధీశ్వరునకు నవనీయంబుల్. స్కం. 3. ప. 779

ఇవి గాక తృతీయస్కంధమునందు 3[illegible], 6[illegible], 809, 973, పద్యములలో నిట్టి ప్రాసములు గలవు.

క. మఱియును నమ్మహితాత్మని, చరణసరోజాతయుగము సకలజగంబుల్
నెఱిఁ గొలువఁ గోరుకోర్కులు, దరమిడివర్షించు నతనిఁ దగునే తెగడన్. స్కం. 4. ప. 88

క. కరమనురక్తిని మోము ని,విరి తద్వృత్తాంత మెల్ల వెలఁదులు నంతః
పురవాసులుఁ జెప్పిన విని, పఱపుగ నిట్టూర్పు లెసఁగ బాష్పాకుల యై. స్కం. 4. ప. 225

చ. పరువడి నష్టలోకపరిపాలకముఖ్యవిభూతియుక్తుఁడై
పరఁగి నృపాసనంబున విభాసితుఁ డౌట స్వభావసిద్ధమై
పఱలుమహావలేపమున వారక సంతతమాననీయస
త్పురుషుల నెల్ల నెందుఁ బరిభూతులఁ జేయుచు నుండె నిచ్చలున్. స్కం. 4. ప. 411

చ. పఱియు నతండు భూగగనమార్గములం దొకవేళ నొక్కఁడే
యరదము నెక్కి క్రుమ్మరు నిరంకుశవృత్తిఁ జరించు మత్తసిం
ధురపథుపోల్కి సత్పురుషదూషితవర్తన నొప్పుచున్ నిరం
తరసుజనాపరాధకృతితత్పరమానసుఁడై క్రమంబునన్. స్కం. 4. ప. 412

ఇవి గాక చతుర్థస్కంధమునందు 75, 95, 112, 195, 234, 285, 416, 520, 651, 924 పద్యములలో నిట్టి ప్రాసములు గలవు.

క. పురిలోన వృషలపతి దా, నరుదుగ సంతానకాముఁడై వేడుకతోఁ
బురుషుఁ డగుపశువుఁ గాళికిఁ, దఱుముక కొని పోవఁ బశువు దలఁగిన భృత్యుల్.
స్కం. 5. ఆ. 1. ప. 129

సీ. మఱియును నా మేరుగిరి లక్షయోజనోన్నత మగుచుండి నూనడిమిదళము...
స్కం. 5. ఆ. 2. ప. 19

ఇందుఁ బ్రథమపాదార్ధమందు బ్రాసయతి

క. కర మనురాగంబున నీ, ధరణీమండలముసంనిధానం బెల్ల
న్నెఱిఁగించితి నింతియ కా, కెఱిఁగించెద సర్గమానమెల్ల నరేంద్రా. స్కం. 5.ఆ.2.ప.76

ఇవి గాక పంచమస్కంధమునందు ఆ 2 లో 5, 103 పద్యములలో నిట్టి ప్రాసంబులు గానంబడును.

చ. సురవరు లేయుబాణములు సూక్ష్మకగోచరమై నభస్థ్సలం
బఱిముఱిఁ గప్పి రేసి దివసాంతముఁ జేసినలీల నాసురీ
శ్వరబలయూథవీరులును సాయకపంక్తులచేత వాని రూ
పఱ శరధూళి జేసి పఱ పైనతమం బొనరించి రార్పుచున్. స్కం. 6. ప. 364

క. దురమునఁ గైదువు వదలిన, శర ణన్నను వైరిజనులఁ జంపరు వీరుల్
వెఱగందనేల కులిశము, కర మరుదుగఁ బుచ్చికొనుము కాచితినింద్రా. స్కం. 6.ప.410

ఇవి గాక షష్ఠస్కంధమునందు 57, 265 పద్యములలో నిట్టి ప్రాసములు గనంబడుచున్నవి.

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు బాహువు లొడ్డఁడు బంధురాజిలోఁ
దూఱఁడు ఘోరకృత్య మని దూఱఁడు తండ్రిని మిత్రవర్గముం
జేరఁడు మాతృసంఘము వసించుసువర్ణగృహంబులోనికిం
దాఱఁడు కావరే యనఁడు తాపము నొందఁడు కంటగింపఁడున్. స్కం. 7. ప. 194

చ. ఎఱుఁగఁడు జీవనౌషధము లెవ్వరు భర్తలు లేరు బాధలం
దరలఁడు నైజతేజమునఁ దథ్యము జాడ్యము లేదు మిక్కిలిన్

మెఱయుచు నున్నవాఁ డొకనిమేషము దైన్యము నొందఁ డింక నే
తెఱఁగున ద్రుంతు వేసరితి దివ్యము పీనిప్రభావ మెట్టిదో. స్కం. 7. ప. 202

క. మఱియును జల ముడుగక వెసఁ, దరుచరుఁ డొకతరువు వ్రేయఁ దాలాంకుం డా
తరువును దునిమిన వెండియుఁ, దొరఁగించెఁ గుజంబు లతఁడు దోడ్తోఁ దునుమన్.
స్కం. 10. ఉ. ప. 553

క. హరిరాక యెఱిఁగి ధర్మజుఁ, డఱలేని ముదంబుతోడ ననుజులు బంధుల్
గురుజనసచివపురోహిత,పరిచారకకరిరథాశ్వభటయుతుఁడగుచున్. స్కం. 10 ఉ. ప. 685

క. నరగంధర్వసురాసుర, వరులకు నిర్జింప రానివాఁడు బలుం డే
మఱి కరయ హీనబలుచేఁ, బరికింపఁగ నెట్లు పట్టువడె నొకో యనుచున్.
స్కం. 10. ఉ. ప. 902

చ. హరి దనమీఁద ఘోరనిశితాశుగజాలము లేయుసాల్వభూ
వరు వధియింపఁ గోరి బహువారివసిర్గగభూరివృష్టివి
స్ఫురణ నమానతీవ్రశరపుంజములన్ గగనంబుఁ గప్పి క్ర
చ్చఱ రిపుమౌళిరత్నమును జాపము వర్మముఁ ద్రుంచి వెండియున్. స్కం. 10. ఉ. ప. 908

ఇవిగాక యీయుత్తరభాగమందు 415, 480, 931, 992, 1064, 1157 మొదలగువానియం దిట్టిప్రాసములుఁ గలవు.

ప్రథమాష్టమనవమస్కంధములయందును దశమస్కంధపూర్వభాగమునం దును లఘ్వలఘురేఫవిరోధనియతి గల దని యెల్లరకుఁ దెల్లం బగు. ఈస్కంధంబులం దలఘురేఫప్రాసపద్యములు, లఘురేఫప్రాసపద్యములు వేర్వేఱ కలవు గాని యేకపద్యమునందే యుభయసాంకర్యము గనఁబట్టదు. కావుననే కూచిమంచి తిమ్మన లోనగువారు రెండురేఫములుఁ గలుపఁబడ వయ్యె ననియుఁ దక్కుంగల యప్పకవి లోనగువారు గలుపంబడియె ననియుఁ జెప్పెదరు. ఈవిషయ మిట్లని నిర్ణయింపం దగినయాధారంబు లేవియుఁ గానము. రెండును గొన్నియెడలఁ గలిపి యుండుటచే లాక్షణికు లుదాహరింప మాని రనుట యట్లుండ నీభాగవతగ్రంథమందు వ్యాకరణదుష్టంబు లగుప్రయోగంబులును గొన్ని గన్పట్టెడి.

ఉదాహరణములు.

1. క్త్వార్థకేత్తునకు సంధి లోనగుదుష్టసంధులు సేయుటయు,

2. హ్రస్వంబుమీఁది నకారంబున కచ్చు పరంబగునపుడు సంస్కృతంబునం బోలె ద్విత్వంబు వచ్చుటయు,

3. ఉకారాంతశబ్దమునకు కువర్ణకంబు పరంబగుచో నగాగమంబు రామియు, మొదలుగాఁ గొన్నిదోషంబులు చంద్రబింబంబునం గళంకంబునుం బోలె నీభాగవతగ్రంథంబునఁ జూపట్టుచున్నను నయ్యవి యొకకొఱంతగా నెవ్వరును భావింపరు.

## క్త్వార్థకేత్తుసంధి కుదాహరణము.

ఎఱిఁగెఱిఁగి బ్రహ్మహత్యాచరితంబు. స్కం. 10. ఉ. ప. 931

హ్రస్వంబుమీఁది నకారంబునకు అచ్చు పరం బగునప్పుడు ద్విత్వంబు వచ్చుటకు

"నీటిపోరాట న్నోటమిపాటుఁ జూపుట కరణ్యాటంబు వాచాటమై" స్కం. 8. ప. 57

"వింటి న్నన్నముఁ గొంటి నీగృహమునన్ వేడ్కన్ ఫలం బబ్బె" స్కం. 9 ప. 146

ఉకారాంతశబ్దమునకు కువర్ణకంబు పరంబగుచో నగాగమంబు రామికి

1. భాగవతసంగలవభాగ్యఫలము కిడె స్కం 1. ప 444

2. రూఢినమ్మనువుకుశతరూపవలన, భూనుతులగు ప్రియవ్రతోత్తానపాదు స్కం. 4 ప. 217

ఇట్టివాని కుదాహరణంబు లనేకములు గలవు కాని వానిని గ్రంథవిస్తరభీతచేఁ దెలుప నైతి గాదయ్యె.

ఈతనికవిత్వంబు తిక్కనసోమయాజి గచించిన

సీ. నెత్తమ్మిఱేకుల మెత్తఁదనముఁ దెచ్చి యచ్చునఁ బెట్టిన ట్లుంద మొంగి
చక్రవాకంబులచందంబు గొనివచ్చి కుప్పలు సేసిన ట్లొప్పు మెఱసి
చందురునుఁగాంతికం దేర్చి హార్చి బాగునకుఁ దెచ్చినయట్లు గొమరు మిగిలి
యళికులంబులకప్పు గలయం యుచు బుచ్చి నారువోసినభంగి నవక మెక్కి

తే. యంఘ్రితలములుఁ గుచములు నాననంబుఁ, గచభరంబును నిట్లున్నరుచిరమూర్తి
యనుపమానభోగములకునాస్పదంబు, గాదెయీత్రిప్పలేటికిఁగమలవదన. విరా ఆ.2. ప. 52

సీ. గండుమీలకుఁ బుట్టి కాముబాణములలోఁగలసి యాడెడునట్టికన్నుఁగవయు
బిసకాండములశిక్షఁ బెరిఁగి లేఁదీఁగల మెచ్చక యున్నట్టిమృదుకరములుఁ
జిగురులతోసంధి సేసి యంబుజములపై నెత్తి చనునట్టిపదములుఁ
గలకంఠములచేతఁ గఱచినవిద్య వీణల కిచ్చునట్టితిన్ననిరొలుంగు

తే. నత్తెఱంగున శేఖయు నవ్విధంబు, గరువచందంబు నమ్మెయికలికిపనము
నట్టిచెన్నును సైరంధ్రియంద కాక, కలవెయొరులకునెఱుఁగకపలికెదు లె. విరా. ఆ.2 ప. 67

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతు
ల్గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యంబెమ్మెయిం గీచకా. విరా. ఆ. 2. ప. 172

సీ. నడిదివియలు సేసె నగరికి మాణిక్యమకుటముల్ పూనినమనుజపతులఁ
దగునాజ్ఞ సూయాణముగ నొనరించె మంచిగ నేలనాలుఁగుసెఱఁగులకును
బ్రీతార్థిజనుల సచేతనత్యాగధ్వజములుగా నన్ని దేశములఁ బఱపె
దిక్కు లన్నింటను దెలుపారుపూఁత గావించె నుజ్జ్వలయశోవిభ్రమంబు

తే. రాజసూయాధ్వరప్రవర్తకుఁడు నిత్య, సత్యభాషామహావ్రతశాలి పాండు
రాజదుగ్ధపయోనిధిరాజుధర్మ,రాజుసుమ్ము మత్స్యావనీరమణ యితఁడు. విరా. ఆ. 5. ప. 320

చ. ధృతరాష్ట్రుండును బుత్రులున్ వనము గుంతీనందనుల్ సింహముల్
మతి నూహింప నసింహమైనవనమున్ మర్దింతు రెందున్ వనా
వృతవృత్తంబులు గానిసింహములకున్ వేగంబ చే టొందుఁ గా
న లగం బొందుట గార్య మీయుభయము న్సంతుష్టిమై నుక్కుకిన్. ఉద్యో.ఆ.1.ప. 359

ఇవి లోనగువానియందుంబోలె భావంబునను బదసారస్యంబునను గవిత్వం బత్యంతప్రౌఢంబు గాక మిక్కిలి సుకుమారమై యుండును. ఈతనిగ్రంథము ప్రాయికంబుగా మూలంబునట్లు సంక్షిప్తముగా నుండక మూలవివరణంబుకై వడి నెంతయు విపులమై చక్కఁగాఁ దెలియ వచ్చుచుండు. ఇందలి ప్రహ్లాదచరిత్రము, గజేంద్రమోక్షము, రుక్మిణీకల్యాణము మొదలగుకథల నెల్లజనులును బరంపరాగతాచారంబుగఁ బఠించుచుండ నియ్యవి సర్వజనచిత్తాకర్షకం బని వేఱ చెప్పవలయునే? ఇం దున్న నరకాసురయుద్ధము, ఉషాపరిణయము లోనగుకొన్నిటియందుఁ గ్రొత్తవిషయములు హరివంశము, విష్ణుపురాణము మొదలగుగ్రంథములం దుండి గ్రహింపఁబడినది ఈపోతనామాత్యుండు భాగవతచతుర్థస్కంధంబున దక్షయాగప్రసక్తిం జేసి పరమేశ్వరుం డైనశివుని దూషించినమహాపాతకంబు పరిహరించుకొఱకు వీరభద్రవిజయ మనునొకగ్రంథము రచియించియున్నాఁడు. అందును గొన్నిదోషంబులు గలవు ఉన్నను నార్యులు గుణగ్రాహులు గావుటంజేసి యది యొకలోపంబుగా భావింపరు. ఇమ్మహాత్మునిగుఱించి యెంతవ్రాసినను మనంబు దనివోదు గాని గ్రంథవిస్తరభయంబునం జేసి మానవలసె.

## సింగన.

ఇతనికవిత్వము కోమలపదగుంభితం బై యనుప్రాసభాసురం బై కొంతవట్టు పోతనకవిత్వంబు ననుసరించి యున్నది. దీని కుదాహరణంబు లితఁడు తెనిఁగించిన షష్ఠస్కంధమందుఁ గొన్ని ముందే తెలుపఁబడినవి. మూలము ననుసరించి, సరిగా నాంధ్రీకరించినవాఁడు గాఁడు. కొన్నిచోట్ల స్వకపోలకల్పితంబు లగువర్ణనంబులం జేసి శ్రోతలకు మిక్కిలి శ్రవణానందంబు గావించి యున్నాఁడు. కొన్నిచోట్ల మూలమునం దున్నవిషయమును మిగుల సంక్షేపించి వ్రాసినాఁడు.

## గంగయనారాయణకవులు.

సింగనకవిత్వముకంటె వీరికవిత్వ మన్నివిషయములఁ గొఱవడి యుండు. నారయకవిత గంగయకవిత్వముకంటె యించుక సరసమై యున్నట్టు చూపట్టు. నారయ సంస్కృతము నాంధ్రీకరించుటయం దేకాదశద్వాదశస్కంధములందు మిక్కిలి సంగ్రహపఱచియున్నాఁడు.

అన్నిటిని జక్కఁగాఁ బరిశీలింపఁ బోతనకవిత్వమే సర్వవిధముల శ్లాఘనీయమై భక్తిరసంబు వెల్లిగొల్పుచు మృదుపదఘటాయుక్తం బై యలంకారసమన్వితంబై భాసిల్లెడు. ఇతనికిఁ గలలోకానుభవం బగ్గలంబు ఇట్టివారికీర్తి యాచంద్రతారార్కమై లోకంబున నెగడ నీగ్రంథంబు పండితపామరజనులచే నిరంతరముఁ బఠింపఁబడి తదీయరసాస్వాదనసుఖం బనుభవింపం బడుఁగాక యని పరమేశ్వరు నాంధ్రభాషాభిమాను లందఱుఁ బ్రార్థింతురుగాత.

## గ్రంథముద్రణోద్యమహేతువు.

ఈపురాణరత్నం బించుమించుగ నన్నూటయేఁబది యేండ్లకుమున్ను బమ్మెర పోతనామాత్యునిచే గీర్వాణభాషనుండి యాంధ్రంబున వ్రాయఁబడినది. ఇయ్యది లేఖకు లెందఱిచేతనో తాళపత్రంబులందు నాత్మీయపాండిత్యానుగుణంబుగ లిఖితమై కొన్నియెడల మార్పులుఁ గొన్నియెడలఁ గూర్పులుఁ గలిగియే యుండవచ్చును. ఆధునికులు ముద్రించుగ్రంథములయందే యెన్నియేని మార్పులుఁ గూర్పులు నేర్పడుచుండ లేఖకులగ్రంథములం దట్టివి లేక పోవునా? ఉండు ననియే చెప్పవలయు. లేఖకు లందఱుం బండితులై యుండ వలనగునే? కొందఱు దమ యజ్ఞానంబునం జేసి తప్పిదములు దమయంతన దొంతరలుగ దొరలుచుండ వానికి లోఁబడుదురు. మఱికొందఱు దమకుఁ గలయల్పవైదుష్యంబున స్వమతానుసారిగ సవరింతురు. కైతలల్ల నేర్చినమఱికొందఱేని స్వప్రయోగానురోధంబుగఁ దమ పరిష్కరించుగ్రంథములం దతినిపుణంబుగ మార్చియుఁ గూర్చియు స్వాభిమతంబు వడయనోపుదురు. ఇట్లుండ లేఖకులం దెవ రెవ రేమేమి సేసిరో యెఱుంగ రాదు. అందు విశేషించి తాళపత్రగ్రంథములందు నిరంకుశంబుగ నేమి సేసినను మాన్పం దరమా? ఇక్కాలంబున ముద్రింపఁబడుగ్రంథములం దే వెల్లడి యగు నని తెలిసియు నాలోచింపక విచ్చలవిడి సవరించుచుండ నియ్యది మాన్ప నలవిగానిచోఁ బెక్కురకుఁ దెలియకుండునట్టు లొక్కరొక్కరు వ్రాసినగ్రంథములను గుఱించి వాక్రువ్వవలయునే? ఇట్టిలేఖకులతాళపత్రగ్రంథములం గొన్నింటినే ప్రమాణంబుగాఁ బరిగ్రహించి ముద్రితగ్రంథంబుల నిగ్రహించి భాగవతంబును సవరించిన సూరులకుం గలధీరత యతిమాత్రంబు శ్లాఘాపాత్రం బనఁ జెల్లుఁ గాదె? ఏతాదృశసూరులలో నొక్కరుఁ డయినయాధునికశోధకుఁడు దనకుమున్ను ముద్రించినవారిని తాత లని హేళనంబు సేయుచు వారిచేఁ బరిష్కరింపఁబడి యనవద్యములై యున్న ప్రయోగంబులం గొన్నిఁటిని సంస్కృతమూలానుసారులై యున్నను దద్విరుద్ధములుగాను, మఱికొన్నింటని ఛందోవ్యాకరణసమ్మతము లై యున్నను లక్షణదూషితంబులుగాను మార్చి గ్రంథమును బూర్వస్థితికంటె నపకృష్టదశకుం దెచ్చియుఁ బెచ్చు పెఱిగి పెద్దలఁ దద్దయు గర్హించుట చూడ నెంతయు సంతాపావహం బై యున్నది. ఈపరిష్కర్త కొన్ని చోట్ల మిక్కిలి చక్కఁగ దిద్దినాఁ డనుట

కించుకయు సందియంబు లేదు. ఇట్టి విషయంబుసం బ్రాజ్ఞు లీయునయెడఁ గృతజ్ఞులై యుందురు సూరిజనాగ్రేసరుం డైన యియ్యన తన కనన్యసామాన్యమైదుష్యంబు గలిగి పూర్వపరిష్కర్తలకంటెఁ దాన మిన్నయని యెన్నికొని వారల నధిక్కరించుట సజ్జనబృందంబున కెట్లు దోఁచు? అయ్యది న్యాయ్యమా? పూర్వులచేఁ బరిష్కరింపఁబడినయాంధ్రభాగవతగ్రంథమునందు నిర్దోషంబులుగా నున్నవిషయంబుల సదోషంబులం గావించి యున్కికిఁ గొన్ని యుదాహరణంబుల స్థాలీపులాకన్యాయంబుగఁ దెల్పెద. ఆర్యుల కియ్యది విచార్యం బైనదిగాన విన్నవింప కుండుట యనర్హంబని దోషంబులఁ దెల్పెదం గాని స్వీయప్రకర్షంబు ప్రకటింపఁ గాదు. మఱి యిందు దోషంబు లున్నను సాధుజనసందోహంబులు నన్ను మన్నించి నాదెసం గారుణ్యంబు సేయుదురుగాత మని యత్యర్థంబు నభ్యర్థించెద.

1. శా. 'స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ గరుణాసంగంబు సాలించి యన్యప్రాణంబులచేత రక్షణము సేయఁడా వాఁ డధోలోకదుఃఖప్రాప్తుం డగు' (స్కం-1-ప-156) దీనికి సంస్కృతంబు 'స్వప్రాణాన్ యః పరప్రాణైః ప్రపుష్ణా త్యఘృణః ఖలః, తద్వధ స్తస్య హి శ్రేయో యద్దోషా ద్యాత్యధః పుమాన్.' (స్కం-1-అ-7-శ్లో-37) పైపద్యమందలి వాఁ డధోలోకదుఃఖప్రాప్తుం డగు అనునది జూచువాఁ డంత్యలోకప్రాప్తుం డగు. అని *మార్పఁబడినది.

2. 'సర్వగుణోత్తరఫలసూచకంబు' (స్కం-1-ప-288) అనునది మహోత్తర ఫలసూచకంబు అని మా. దీనికి సంస్కృతము 'తత స్సర్వగుణోదర్కే సానుకూలగ్రహోదయే.' స్కం-1-అ-12-శ్లో-12.

3. 'అశ్వమేధయాగంబు సేయం దలంచి ప్రజలవలన' (స్కం-1-ప-298) అనునది అశ్వమేధ యాగంబు సేయుచుఁ బ్రజలవలన అని మా. దీనికి సంస్కృతము. 'యక్ష్యమాణోఽశ్వమేధేన జ్ఞాతిద్రోహజిహాసయా.' (స్కం-1-అ-13-శ్లో-32) యక్ష్యమాణః అనుదానికి యజ్ఞము సేయఁబోవుచు (అనఁగా తలంచి) అని గాని యజ్ఞము సేయుచుఁ బ్రజలవలన సముపాత్తం బైనవిత్తంబు చాలక అనుట సరిగాదు. యజ్ఞము చేయుటకు ముందే విత్తమును గూర్పవలయుంగాని చేయుచు గాదు. కావున చేయం దలంచి యనునదియే సరి.

4. 'స్వర్గమేనిని నపవర్గమేని భాగవతసంగలవభాగ్యఫలము కీడె.' (స్కం-1-ప-444) అనునది జన్మాంతరము లేనిస్వర్గమైన, విష్ణుభక్తులసంగంబు వెలకు రాదు. అని మా. పైరెంటియందు ఏది సంస్కృతమునకు సరిగా నున్నదో విమర్శించునది. సంస్కృతము. 'తులయామ లవే నాపి న స్వర్గం నాపునర్భవం, భగవత్సంగిసంగస్య మర్త్యానాం కిము తాశిషః.' (స్కం-1-అ-18-శ్లో-13.)

5. 'కాల దేవ సత్త్వరజస్తమో గుణాహంకార మహాతత్త్వప్రధానంబులకుఁ బ్రభుత్వంబు లేదు.' (స్కం-2-ప-28.) అనుదానికి కాలదేశ...లేదు. అని యున్నది. దీనికి సంస్కృతమున 'నయత్ర కాలోఽనిమిషాం పరః ప్రభుః కుతో ను దేవా జగతాం య ఈశిరే' (స్కం-2-అ-2-శ్లో-17) ఇందు 'దేవాః' అని ఉన్నదిగాని 'దేశాః' అని లేదు.

6. 'ద్వితీయం బండసంస్థితం బనం దగుఁ దృతీయంబు సర్వభూతస్థం బన నొప్పు' (స్కం-2-ప-112. )అనునది, ద్వితీయం బఖండసంస్థితంబును దృతీయంబు సర్వభూతజననంబును గలిగియుండు

* (మార్పఁబడినది. అనుదానికి మాఱుగా మా. అని ముద్రింపఁబడును.)

ప్రసిద్ధి యేమి, కర్మమున సంభవించెను గడఁగి. నాకు, చిత్త మజ్ఞానదుర్గమస్థితిఁ గలంగి, యద్భుతం బునఁ బొంచెడు నఘుచరిత. అని మా. సం. అముష్య దుర్భగత్వం వా క్లేశో వా కర్మభిః కృతః, ఏతస్మిన్నే మనో విద్వన్ ఖిద్యతే జ్ఞానసంకటే, తన్మే పరాణుద విభో కశ్మలం మానసం మహత్. (స్కం-3. అ-7-శ్లో-5-6) అని యున్నది. దీనికి సరియైన తెలుఁగు మొదటిపద్యముగాని రెండవ పద్యము కాదు.

12. నలినభవసూతి యైనసనత్కుమార, కునకు నెఱిఁగించెసాంఖ్యాయనునకు నతఁడు (స్కం-3-ప-268) అనునది "నలినభవసూతి యైనసనత్కుమార, కునకు నెఱిఁగించె నతఁడు సాంఖ్యునకుఁ దగను. అని మా. దీనికి సంస్కృతము. సనత్కుమారాయ స చాహ పృష్టః సాంఖ్యాయనా యాథ ధృతవ్రతాయ, సాంఖ్యాయనః పారమహంస్యముఖ్యో వివక్షమాణో భగవద్విభూతిః. (స్కం-3-అ-81-శ్లో-7-8) ఇక్కడ పేరుకూడ మార్చుట చూడఁగా బరిష్కర్త కలిసాహస మని తోఁచెడి.

13. మహత్తత్త్వంబు ప్రథమసర్గం బది...ద్రవ్యజ్ఞానక్రియాత్మకం బైనయహంకార తత్త్వంబు ద్వితీయసర్గంబు (స్కం-3-ప-344) అనునది మహత్తత్త్వగుణాశ్రయంబు ప్రథమసర్గం బది...క్రియోదయం బైనయహంకారతత్త్వంబు ద్వితీయసర్గంబు అని మా. దీనికి సంస్కృతము. ఆద్యస్తు మహతస్సర్గో గుణవైషమ్య మాత్మనః, ద్వితీయస్త్వహమో యస్తు ద్రవ్యజ్ఞానక్రియాత్మకః, భూతసర్గస్తృతీయస్తు తన్మాత్రో ద్రవ్యశక్తిమాన్, చతుర్థ ఐంద్రియ స్సర్గో యస్తు జ్ఞానక్రియాత్మకః. (స్కం-3-అ-10-శ్లో-14-15-16. ఇందు ద్రవ్యజ్ఞానక్రియాత్మకః అనుదానికి ద్రవ్యజ్ఞానక్రియోదయః అని బొంబాయిప్రతిలోనిపాఠము.) అయినను మహత్తత్త్వగుణాశ్రయం బనుటయేల? మహత్తత్త్వ మనుటయ చాలదా? రెండవదానియం దుపక్రమము చూడఁగా, క్రియాత్మకః అనుటయె సరి యనియు నీదేశపాఠమందుఁ గ్రియాత్మకః అని యున్నదిగాన దాని ననుసరించియే పోతన వ్రాసియుండు ననియుం దోఁపక మానదు.

14. జననం బందిననీలలోహితుఁడు గంజాతాసనుం జూచి యి, ట్లను నోదేవ మదాఖ్య లెట్టివి మదీయావాసముల్ పేర్క నా, కనయంబు న్నెఱిఁగింపవే. (స్కం-3-ప-368) అనునది జననంబందిన నీలలోహితుఁడు గంజాతాసనుం జూచి యిట్లను నోదేవ మదాఖ్య యెట్టిది మదీయావాస మెచ్చోటు నా, కనయంబు న్నెఱిఁగింపవే. అని మా. దీనికి సంస్కృతము. స వై రురోద దేవానాం పూర్వజో భగవాన్ భవః, నామాని కురు మే ధాతః స్థానానిచ జగద్గురో (స్కం-3-అ-12-శ్లో-8) ఇందు నామాని స్థానాని అని బహువచనము లున్నవిగాన తెలుఁగునను నట్లే యుండవలయును.

15. ఉ. నైకొని యిట్లు పంకరుహగర్భనియంత్రితు లై (స్కం-3-ప-375) అనుదానియందలి నియంత్రితు లై అనుగాని నిమంత్రితులై అనిమా. దీనికి సంస్కృతము ఏవం పద్మభువా దిష్టః పరిక్రమ్య గిరాంపతిమ్ (స్కం-3-అ-12-శ్లో-20) ఆదిష్టః=1. ఆదేశింపఁబడినవాఁడు, 2. నియమింపఁబడినవాఁడు. రెండుపాఠంబుల నేది సరియో [illegible]ర్యులు పర్యాలోచింతురుగాక.

16. దుహితృస్నేహపరిక్లిష్టాంతఃకరణుండ నై (స్కం-3-ప-780) అనుదానికి దుహితృస్నేహ దుఃఖపరిచ్ఛిన్నాంతఃకరణుండ నై అని యున్నది. దీనికి సంస్కృతము. సభవాన్ దుహితుస్స్నేహ పరిక్లిష్టాత్మనో మమ. (స్కం-3-అ-22-శ్లో-8) ఇం దేపాఠము సంస్కృతమునకు సరిగా నున్నదో పండితు లూహించునది.

17. భక్తితాత్పర్యస్నేహంబులు రెట్టింపం (స్కం-3-ప-803) అనునది భక్తితాత్పర్యస్నేహ భయంబులు రెట్టింప అని మా. దీనికి సంస్కృతము. తుష్టోఽహ మద్య తవ మానవిమానదాయాః (స్కం-3-అ-23-శ్లో-6) ఇందు భయ మనుమాట లేదు.

18. ఇతనికి నస్మత్తనూజను విధిప్రేరితుండ నై యిచ్చితి (స్కం-4-ప-44) అనునది ఇతనికి నస్మత్తనూజను విధివత్ప్రకారంబున నిచ్చితి అని మా. దీనికి సంస్కృతము. దత్తా బత మయా సాధ్వీ చోదితా త్పరమేష్ఠినః (స్కం-4-అ-2-శ్లో-15) ఇందు ప్రేరితుండ నై అనునదియే సరి.

19. సిద్ధగణమహర్షి జనంబులు (స్కం-4-ప-144) అనునది సిద్ధదేవమహాఋషిజనములు అని మా. దీనికి సంస్కృతము. తథా పరౌ సిద్ధగణా మహర్షిభి ర్యే వై సమంతా దను నీలలోహితమ్ (స్కం-4-అ-6-శ్లో-41)

20. జగములకు నెల్ల యోనిబీజంబు లైన, శక్తిశివకారణుండ వై జగతి నిర్వి, కార బ్రహ్మంబ వగునిన్నుఁ గడఁగి విశ్వ, నాథుఁగా నెఱింగెద నామనమున నభవ. (స్కం-4-ప-145) అనుదాని యందలి నిర్వికార బ్రహ్మంబ వగునిన్ను అనునది నిర్వికారతత్త్వంబ వగునిన్ను అని మా. సంస్కృతము. జానే త్వా మీశ విశ్వస్య జగతో యోనిబీజయోః, శక్తేః శివస్యచ పరం యత్త ద్బ్రహ్మనిరన్తరమ్ (స్కం-4-అ-6-శ్లో-42)

21. త్వదీయపాదారవిందనిహితచిత్తులై (స్కం-4-ప-148) అనునది త్వదీయపాదారవింద భజను లై అని మా. దీనికి సం. న వై సతాం త్వచ్చరణార్పితాత్మనామ్ (స్కం-4-అ-6-శ్లో-46) అని యున్నది కాన పాదారవిందనిహితచిత్తులై అనునదియే సరి.

22. ఉండియుం గృతానుగ్రహనిగ్రహుండు (స్కం-4-ప-170) అనునది ఉండియు భక్తాను గ్రహపరిగ్రహుం డగుటం జేసి అని మా. సం. యథామతి గృణంతి స్మ కృతానుగ్రహనిగ్రహమ్ (స్కం-4-అ-7-శ్లో-24)

23. కానంగ నోపరు బ్రహ్మాదిశరీరు లజ్ఞులయి యోపద్మాక్ష భక్తార్తిసం, హరణా లోకన నన్నుఁ గానఁ దగు నిత్యానందసంధాయి వై (స్కం-4-ప-177) అనుదానియందలి బ్రహ్మాదిశరీరులజ్ఞు లయి అనునది బ్రహ్మాదిశరీరధారులును అని మా. సం. బ్రహ్మాదయ స్తనుభృత స్తమసి స్వపన్తః (స్కం-4-అ-7-శ్లో-30) అందలి తమసి స్వపన్తః అనుదానికిఁ దెలుఁగుండఁగా నది వదలఁబడి వేఱుగా మార్పఁబడినది. అది సరికాదు.

24. అనఘా యేనును బ్రహ్మయుం శివుండును నీజగంబులకుఁ గారణభూతుల మందు నీశ్వరుం డగు నుపద్రష్టను స్వయంప్రకాశకుండును నై (స్కం-4-ప-207) అనునది అనఘా కారణభూ తుండును నీశ్వరుండును ద్రష్టయును స్వయంప్రకాశకుండును నైనయేను అని మా. సం. అహం బ్రహ్మాచ శర్వశ్చ జగతః పరమ కారణం, ఆత్మేశ్వర ఉపద్రష్టా స్వయం దృగవిశేషణః (స్కం-4-అ-7-శ్లో-50) ఈశ్లోకమం దున్నవిషయ మెంత రెండవదానియందు విడువఁబడినదో చూచునది.

25. వితతయోగీంద్రనికరగవేష్యమాణ (స్కం-4-ప-233) అనునది వితతయోగీంద్రకరసం వేష్ట్యమాణ అని మా. సం ముముక్షుభిర్మృగ్యపదాబ్జపద్ధతిమ్ (స్కం-4-అ-8-శ్లో-23) మృగ్య అను దానికి గవేష్యమాణ అనునదియే సరియైనది.

26. ఘోరవృకాహిభల్లముఖసత్త్వశ్రేణి భక్షించెనో (స్కం-4-ప-261) అనుదానియందలి భక్షించెనో అనుదానికి నిర్జించెనో అని మా. సం. అ ప్యనాథం వనే బ్రహ్మన్ మాస్మాదంత్యర్భకం వృకాః (స్కం-4-అ-8-శ్లో-68) బొంబాయి ముద్రణమందు 66 - వ శ్లోకముగా నున్నది. ఇందు అదన్తి అనుదానికి భక్షించెనో అనునదియే సరియైనది.

27. నిత్యముక్తుండవును బరిశుద్ధుండవును సర్వజ్ఞుండవును నాత్మవును (స్కం-4-ప-288) అను నిత్యముక్తుండవును బరిశుద్ధుండవును చిద్రూపకుండవును నాత్మవును. అని మా. సం. త్వం నిత్య ముక్త పరిశుద్ధ విబుద్ధ ఆత్మా (స్కం.4-అ-9-శ్లో-15) వ్యాఖ్యయందు విబుద్ధః = సర్వజ్ఞః అని యున్నది. కావున సర్వజ్ఞుండును అనునదియే సరి.

28. భ్రాతృమరణంబు విని కోపామర్ష శోకవ్యాకులితచిత్తుం డై (స్కం-4-ప-322) అను దానిని భ్రాతృమరణంబు విని శోకవ్యాకులితచిత్తుం డై అని మా. సం. ధ్రువో భ్రాతృవధం శ్రుత్వా కోపామర్ష శుచార్పితః (స్కం-4-అ-10-శ్లో-4) శ్లోకమందును ముందటి ముద్రణమందును న్నకోపామర్ష అనునది విడువఁబడినది.

29. శ్రద్ధాయుక్తులై ధృతవ్రతులై (స్కం-4-ప-395) ఇందలి ధృతవ్రతులై అనునది దృఢవ్రతులై అని మా. సం. గోజితాని ధృతవ్రతైః (స్కం-4-అ-13-శ్లో-27)

30 అరసి సునీథయు శోకార్త, తురదైని పనసునుఁడు సనువుఁ దొఱఁగినఁ దవనం, తరమునను యోగశక్తిం, బరువడి నిజతనయుతనువుఁ బరిపాలించెన్ (స్కం-4-ప-429) ఇందలి నిజతనయుతను బరిపాలించెన్ అనునది నిజరాజ్యము వసి పరిపాలించెన్ అని మా. సంస్కృతము. ఋషిభిః స్వాశ్రమపదం గతే వృత్రకళేబరమ్, సునీథా పాలయామాస విద్యాయోగేన శోచతీ (స్కం-4-14-శ్లో-35) అని యున్నది కాన నిజతనయుతనువు అనునదియే సరి.

31. ఈవైన్యుఁ డఖిలలోకావలి ధర్మానువర్తనముల నెప్డు వఱలఁజేసి, ఘనధర్మమార్గ వర్తనులలో ధన్యుఁ డై (స్కం-4-ప-454) ఇందలి ఘనధర్మమార్గవర్తనులలో ధన్యుఁడై అనునది వర్తనులలో ముఖ్యుఁడై అని మా. సం. ఏష ధర్మభృతాం శ్రేష్ఠో లోకం ధర్మేఽనువర్తయన్ (స్కం-అ16-శ్లో-4) శ్రేష్ఠః అనుదానికి ముఖ్యుఁ డని కాదు. ధన్యుఁ డనునదియే సరి.

32. అష్టదిక్పాలకమూర్తి సంకలితుఁ డగుచు (స్కం. 4.ప.454) ఇందలి మూర్తి అనుదానికి అవయవ అని మా. సం. ఏషవైలోకపాలానాంబిభర్త్యేకస్తనౌతనూః(స్కం. 4. అ. 16.శ్లో. 5) తనూః అనుదానికి మూర్తి యనునదియే సరియైనది. అవయవ అనునది తప్పు.

33. ఆత్మస్తుతినిందలవలన నుదాసీనుం డగుచు (స్కం. 4. ప. 457) అనునది ఆత్మస్తుతి పరనిందలవలన నుదాసీనుం డగుచు అని మా. సం. అంత ర్బహిశ్చ భూతానాం పశ్యన్ కర్మాణి చారణైః, ఉదాసీన ఇ వాధ్యక్షో వాయు రాత్మేవ దేహినామ్ (స్కం. 4 అ. 16.శ్లో.12) ఈశ్లోకమునకు వ్యాఖ్యలో చారణైః గుప్తభృత్యైః పశ్యన్నపి స్తుతినిందాది ష్వుదాసీనఇవ వర్తిష్యతే అని యున్నది. కావున పరనిందలవలన అని చెప్పుట సరిగాదు. ఆత్మనింద యనుటయే సరి.

34. మేరువుపోలికి సత్త్వవంతుఁడును (స్కం.4.ప 642) అనునది మేరువుపోలికి ధైర్యవంతుండును. అని మా. సం. సముద్ర ఇవ దుర్బోధః సత్త్వే నాచలరా డివ (స్కం.4అ.22.శ్లో.58) ఇందలి వ్యాఖ్యయందు అచలరాట్ మేరురివ అని యున్నది గాన మొదటిపాఠమే సరి. మార్పు తప్పు.

35. కీర్తిపూరము సుధీజనకర్ణములందు నించి (స్కం 4. ప. 644) అనునది కీర్తిపూరముల దిగ్గజకర్ణములందు నించి అని మా. సం. కీర్త్యోరుగీతయా పుంభి స్త్రైలోక్యే తత్ర తత్రహ, ప్రవిష్టః కర్ణరంధ్రేషు స్త్రీణాం రామః సతామివ (స్కం. 4. అ. 22. శ్లో. 63)ఇందలి సతాం కర్ణరంధ్రేషు అనుదానికి సుధీజనకర్ణములందు అనుటయే సరి.

36. క్రమానుసిద్ధం బయినతపంబున (స్కం.4,ప.649) అనునది క్రమానిరుద్ధం బయినతపంబున అని మా. సం. తేన క్రమానుసిద్ధేన ధ్వస్తకర్మామలాశయః (స్కం. 4. అ. 23. శ్లో.8) ఇందు క్రమానుసిద్ధంబు అనుపాఠమే సరి.

37 దాని జపధ్యానపూజానియమంబుల సేవించుచు (స్కం. 4. ప. 684) అనునది దానివస్తు ధ్యానపూజానియమంబునఁ దపంబు సేయుచుండ అని మా. సం. తద్ధ్యాయంతో జపన్తశ్చ పూజయంతశ్చ సంయతాః (స్కం. 4.అ 24.శ్లో.15) అని యున్నది గాన మొదట నున్నదే సరి.

38. భూమి యధార్మికరాజచోరపీడానిరతిం (స్కం. 4.ప. 843) అనునది భూతల మెల్ల నుగ్రచోరపీడానిరతిం అని మా. సం. ఉత్తిష్ఠోత్తిష్ఠ రాజర్షే ఇమా ముదధి మేఖలామ్, దస్యుభ్యః క్షత్రబంధుభ్యో బిభ్యతీం పాతు మర్హసి. (స్కం. 4.అ.28.శ్లో.48) అని యున్నదిగాన మొదటి పాఠమే సరి.

39. ఏయేతెఱంగుల నింద్రియములు, వికృతిని బొందు నావిధమున (స్కం-4-ప-895) అనునది ఏయేతెఱంగుల నింద్రియములు, వికసించు నానావిధమున అని మా. సం. యథా యథా విక్రియతే గుణాన్తో వికరోతి వా, తథా తథోపద్రష్టాత్మా తద్వృత్తీరనుకార్యతే (స్కం-4-అ-29-శ్లో-20) బొంబాయి ముద్రణమందు శ్లో-17 అని యున్నది గాన వికసించు అనునది తప్పు. వికృతి బొందు అనునది సరి.

40. అతిమనోహరవనితాజనాలాప (స్కం-4-ప-898) అనునది అతిమనోహరవాంఛితవనితాజనాలాప. అని మా. సం. అతిమనోహరవనితాజనాలాపే ష్వతిస్పృహాం ప్రణోభిమకర్ణం (స్కం-4-అ-29-శ్లో-54) అని యున్నది కావున వాంఛిత అనుమాట యనావశ్యకము గాదు.

41. అనఘాత్ములారా యభిన్నధర్మశీలు రయినమీరు నందఱును (స్కం-4-ప-911) అనునది అనఘాత్ములారా యభిన్నధర్మశీలనామములయినమీరు నందఱును అని మా. సం. అపృథగ్ధర్మశీలానాం సర్వేషాం వ స్సుమధ్యమా (స్కం-4-అ-30-శ్లో-16) కాన నామముల రనుమాట యనావశ్యకము.

42. పరుండవు శుద్ధుండవు (స్కం. 4.ప. 936) అనునది పరుండవు బుద్ధుండవు అని మా. సం. నమ స్సమాయ శుద్ధాయ పురుషాయ పరాయచ (స్కం-4-అ-30-శ్లో-42) బొంబాయి ముద్రణమందును ఇట్లే ఉన్నది. కావున బుద్ధుండవు అనుమాట సరికాదు.

43. యోగవీర్యజ్ఞానార్థధర్మంబులను (స్కం-5-అ-1-ప-11) అనునది యోగజ్ఞానదానార్థధర్మంబులను అని మా. సం. యోగవీర్యేణ మనీషయావా (స్కం-5- అ. 1-శ్లో-12) అని యున్నదిగాన మొదటిపాఠమే సంస్కృతము ననుసరించి యున్నది.

44. ధవళకాంతియుక్తిఁ దనరుదేహంబును,(స్కం-5-అ-1 ప-56)అనునది అతనికాంతియుక్తమయిన దేహంబును అని మా. సం శుక్లయా తను వావతతార (స్కం-5-అ-3-శ్లో-19) కావున ధవళ అనుమాటయే సరి.

45. లోకానుశాసనార్థం బాచారంబు (స్కం-5-అ-1-ప-78) అనునది లోకప్రదర్శనార్థం బాచారంబు అని మా. సం. లోకానుశాసనార్థం (స్కం-5-అ-5-శ్లో-28)

46. కలిగి సుఖదుఃఖంబులయందు (స్కం-5-అ-1-ప-128) అనునది కలిగి యిహసుఖదుఃఖంబులయందు అని మా. సం. సుఖదుఃఖయో ర్ద్వంద్వనిమిత్తయో రసంభావితదేహాభిమానః (స్కం-5-అ-9-శ్లో-9) ఇందు ఇహ అనుమాట లేదు. కాన యది యనావశ్యకము.

47. భక్తియోగంబున నిమీలితనేత్రుండై (స్కం. 5. ప. 32) అనునది భక్తి నిలిపి యోగంబున నిమీలితనేత్రుండై అని మా. సం. అస్మత్కులదేవతాచరణారవిందోదకం భక్తియోగేన......శిరసా బిభర్తి (స్కం. 5. అ. 17. శ్లో. 3) సరిపోల్చి చూచునది.

48. విశేష పాదపం, కరుహాముం బూజసేయక యకర్మముం జేసితి నల్పబుద్ధినై (స్కం. 6. ప. 265) అనునది విశేషపాదపం, కరుహాముం బూజసేయక యకర్మముం జేసితి నప్రబుద్ధినై అని మా. సం. అహో బత మయా సాధు కృతం వై దభ్రబుద్ధినా (స్కం. 6. అ. 7. శ్లో. 11) దభ్రబుద్ధినా అనుదానికి అల్పబుద్ధినై అనునదియే సరి.

49. మురరిపుకడకుం, గునుకుచుం గునుకుచు నేఁగిరి (స్కం. 6. ప. 325) అనునది మురరిపు భక్తుల్, గునుకుచుం గునుకుచు నేఁగిరి అని మా. సం. ప్రత్యఞ్చ మాదిపురుష ముపతస్థు స్సమాహితాః (స్కం. 6. అ. 9. శ్లో. 19) ఉపతస్థుః అనుదానికి కడకు నేఁగిరి అని చెప్పవలయుం గాని భకు నేఁగిరి అని కాదు.

50. కమనీయమాణిక్యఘనకిరీటమువాని దివ్యవిభూషణదీప్తివాని, మండితకేయూరకుండలంబులవాని (స్కం. 6. ప. 332) అనునది కమనీయమాణిక్యఘనకిరీటమువాని దివ్యవిభూషణదీప్తివాని, మండితకోటీరకుండలంబులవాని అని మా. రెండుపదానియందు గల కిరీటకోటీరశబ్దములకు అర్థమొక్కటే కోటీర మనఁగా గిరీట మని హేమచంద్రుఁడు. కోటీరమునకు జట యని యర్థము గలదు గాని యది యిందుఁ బొసఁగదు. కాన కోటీరశబ్దము యుక్తము కాదు. కేయూరశబ్దమే సరి అని తోఁచెడిని.

51. హరికథాతత్పరత్వంబును వాసుదేవునియందలి ప్రేమయు నారాయణగుణకర్మనామకీర్తనంబును (స్కం. 7. ప. 239) అనునది హరికథాతత్పరత్వంబును వాసుదేవునియందలి ప్రేమయు నారాయణగుణకర్మకథానామకీర్తనంబును అని మా. సం. శ్రద్ధయా తత్కథాయాంచ కీర్తనై ర్గుణకర్మణాం, తత్పాదాంబురుహధ్యానా త్తల్లింగేక్షార్హణాదిభిః (స్కం. 7. అ. 7. శ్లో. 33) బొంబాయిముద్రణమందు 31) హరికథాతత్పరత్వంబును అని మొదలనే యున్నదిగాన కర్మ అనుదానికి తర్వాత కథా అనునది పునరుక్తమై యనావశ్యకమై యున్నది.

52. బ్రహ్మమైనవానిఁ బరుని నతీంద్రియు నీశు దూరు సూక్ష్ము నే భజింతు(స్కం. 8. ప. 83) అనునది బ్రహ్మమైనవానిఁ బరుని నతీంద్రియు నీశు స్థూలు సూక్ష్ము నే భజింతు అని మా.స.త మక్షరం బ్రహ్మ పరం పరేశ మవ్యక్త మాధ్యాత్మికయోగగమ్యం, అతీంద్రియం సూక్ష్మ మివాతిదూర మనంతమాద్యం) మీడ్యం పరిపూర్ణ మీడే (స్కం. 8. అ. 3. శ్లో. 21. చన్నపురీ బొంబాయినా ముద్రణములు రెండు నిట్లే) అని యున్నది గాన స్థూలు అను మాటకంటె దూరు అను మాటయే సంగతము. ఈపరిష్కర్తం బోలినవారే యొకరు స్థూలు అనునది సూక్ష్ము అను దానికి విరుద్ధము గాన సరియని తాళపత్రగ్రంథములో మార్చి యుండవలయుం. అది నిర్మూలము.

53. ప్రణతుఁడై సంఫుల్ల, పద్మవదనుఁ డగుచుం బలికెఁ దెలియ (స్కం. 8. ప. 149) అనునది ప్రణతుఁడై సంఫుల్ల, పద్మనయనుఁ డగుచుం బలికెఁ దెలియ అని మా. సం. ఉవాచోత్ఫుల్లవదనో దేవాన్ స భగవాన్ పరః (స్కం. 8. అ. 5. శ్లో. 20. చన్నపురీ బొంబాయి ముద్రణములు రెండు నిట్లే) అని యున్కిం జేసి సంఫుల్లపద్మవదనుఁ డగుచు అనుటయే సరి. సంఫుల్లపద్మనయనుఁ డనుట నిర్మూలము.

36. క్రమానుసిద్ధం బయినతపంబున (స్కం.4,ప.649) అనునది క్రమానిరుద్ధం బయినతపంబున అని మా. సం. తేన క్రమానుసిద్ధేన ధ్వస్తకర్మామలాశయః (స్కం. 4. అ. 23. శ్లో.8) ఇందు క్రమానుసిద్ధంబు అనుపాఠమే సరి.

37. దాని జపధ్యానపూజానియమంబుల సేవించుచు (స్కం. 4. ప. 684) అనునది దానివస్తు ధ్యానపూజానియమంబునఁ దపంబు సేయుచుండ అని మా. సం. ధ్యాయంతో జపన్తశ్చ పూజయంతశ్చ సంయతాః (స్కం 4.అ 24.శ్లో.15) అని యున్నది గాన మొదట నున్నదే సరి.

38. భూమి యథార్థికరాజచోరపీడానిరతిం (స్కం. 4.ప. 843) అనునది భూతల మెల్ల నుగ్రచోరపీడానిరతిం అని మా. సం. ఉత్తిష్ఠోత్తిష్ఠ రాజర్షే ఇమా ముదధి మేఖలామ్, దస్యుభ్యః క్షత్త్రబంధుభ్యో బిభ్యతీం పాతు మర్హసి. (స్కం.4.అ.28.శ్లో.48) అని యున్నదిగాన మొదటి పాఠమే సరి.

39. ఏయే తెఱంగుల నింద్రియములు, వికృతిని బొందు నావిధమున (స్కం-4-ప-85) అనునది ఏయే తెఱంగుల నింద్రియములు, వికసించు నాయాయివిధమున అని మా. సం. యథా యథా విక్రియతే గుణాక్తో వికరోతివా, తథా తథోపద్రష్టాత్మా తద్వృత్తీరనుకార్యతే (స్కం-4-అ-29-శ్లో-20) బొంబాయి ముద్రణమందు శ్లో-17 అని యున్నది గాన వికసించు అనునది తప్పు. వికృతి బొందు అనునది సరి.

40. అతిమనోహరవనితాజనాలాప (స్కం-44-ప-88) అనునది అతిమనోహరవాంఛితవనితాజనాలాప. అని మా. సం. అతిమనోహరవనితాజనాలాపే ష్వతిశగాం ప్రశాభిశకర్ణం (స్కం-4-అ-29-శ్లో-54) అని యున్నది కావున వాంఛిత అనుమాట యావశ్యకము గాదు.

41. అనఘాత్ములారా యభిన్నధర్మశీలు రయినమీరు నందఱును (స్కం-44-ప-911) అనునది అనఘాత్ములారా యభిన్నధర్మశీలనాములయినమీరు నందఱును అని మా. సం. అపృథగ్ధర్మశీలానాం సర్వేషాం వ స్సుమధ్యమా (స్కం-4-అ-30-శ్లో-16) కాన నాముల రనుమాట యనావశ్యకము.

42. పరుండవు శుద్ధుండవు (స్కం. 4.ప. 936) అనునది పరుండవు బుద్ధుండవు అని మా. సం. నమ స్సమాయ శుద్ధాయ పురుషాయ పరాయచ (స్కం-4-అ-30-శ్లో-42) బొంబాయి ముద్రణమందును ఇట్లే ఉన్నది. కావున బుద్ధుండవు అనుమాట సరికాదు.

43. యోగవీర్యజ్ఞానార్థధర్మంబులను (స్కం-5-అ-1-ప-11) అనునది యోగజ్ఞానదానార్థధర్మంబులను అని మా. సం. యోగవీర్యేణ మనీషయావా (స్కం-5- అ. 1-శ్లో-12) అని యున్నది గాన మొదటిపాఠమే సంస్కృతము ననుసరించి యున్నది.

44. ధవళకాంతియుక్తిఁ దనరుదేహంబును,(స్కం-5-అ-1 ప-56)అనునది అతనికాంతియుక్తమయిన దేహంబును అని మా. సం శుక్లయా తను వావతతార (స్కం-5-అ-3-శ్లో-19) కావున ధవళ అనుమాటయే సరి.

45. లోకానుశాసనార్థం బాచారంబు (స్కం-5-అ-1-ప-78) అనునది లోకప్రదర్శనార్థం బాచారంబు అని మా. సం. లోకానుశాసనార్థం (స్కం-5-అ-5-శ్లో-28)

46. కలిగి సుఖదుఃఖంబులయందు (స్కం-5-అ-1-ప-128) అనునది కలిగి యిహసుఖదుఃఖంబులయందు అని మా. సం. సుఖదుఃఖయో ర్ద్వంద్వనిమిత్తయో రసంభావితదేహాభిమానః (స్కం-5-అ-9-శ్లో-9) ఇందు ఇహ అనుమాట లేదు. కాన యది యనావశ్యకము.

47. భక్తియోగంబున నిమీలితనేత్రుఁడై (స్కం. 5. ఆ. 2. ప. 32) అనునది భక్తి నిలిపి యోగంబున నిమీలితనేత్రుఁడై అని మా. సం అస్మత్కులదేవతాచరణారవిందోదకం భక్తియోగేన......శిరసా బిభర్తి (స్కం. 5. అ. 17. శ్లో. 3) సరిపోల్చి చూచునది.

48. విశేష పాదపం, కరుహాముఁ బూజసేయక యకర్మముఁ జేసితి నల్పబుద్ధినై (స్కం. 6. ప. 265) అనునది విశేషపాదపం, కరుహాముఁ బూజసేయక యకర్మముఁ జేసితి నప్రబుద్ధినై అని మా. సం. అహో బత మయా సాధు కృతం వై దభ్రబుద్ధినా (స్కం. 6. అ. 7. శ్లో. 11) దభ్రబుద్ధినా అనుదానికి అల్పబుద్ధినై అనునదియే సరి.

49. మురరిపుకడకుం, గునుకుచుఁ గునుకుచు నేఁగిరి (స్కం. 6. ప. 325) అనునది మురరిపు సభకుఁ, గునుకుచుఁ గునుకుచు నేఁగిరి అని మా. సం. ప్రత్యఞ్చ మాదిపురుష ముపతస్థు స్సమాహితాః (స్కం. 6. అ. 9. శ్లో. 19) ఉపతస్థుః అనుదానికి కడకు నేఁగిరి అని చెప్పవలయుఁ గాని సభకు నేఁగిరి అని కాదు.

50. కమనీయమాణిక్యఘనకిరీటమువాని దివ్యవిభూషణదీప్తివాని, మండితకేయూరకుండలంబులవాని (స్కం. 6. ప. 332) అనునది కమనీయమాణిక్యఘనకిరీటమువాని దివ్యవిభూషణదీప్తివాని, మండితకోటీరకుండలంబులవాని అని మా. రెండవదానియందు గల కిరీటకోటీరశబ్దములకు అర్థమొక్కటే కోటీర మనఁగా గిరీట మని హేమచంద్రుఁడు. కోటీరమునకు జట యని యర్థము గలదు గాని యది యిందుఁ బొసఁగదు. కాన కోటీరశబ్దము యుక్తము కాదు. కేయూరశబ్దమే సరి అని తోఁచెడిని.

51. హరికథాతత్పరత్వంబును వాసుదేవునియందలి ప్రేమయు నారాయణగుణకర్మనామకీర్తనంబును (స్కం. 7. ప. 239) అనునది హరికథాతత్పరత్వంబును వాసుదేవునియందలి ప్రేమయు నారాయణగుణకర్మకథానామకీర్తనంబును అని మా. సం. శ్రద్ధయా తత్కథాయాంచ కీర్తనై ర్గుణకర్మణాం, తత్పాదాంబురుహధ్యానా త్తల్లింగేక్షార్హణాదిభిః (స్కం. 7. అ. 7. శ్లో. 33) (బొంబాయిముద్రణమందు 31) హరికథాతత్పరత్వంబును అని మొదలనే యున్నదిగాన కర్మ అనుదానికి తర్వాత కథా అనునది పునరుక్తమై యనావశ్యకమై యున్నది.

52. బ్రహ్మమైనవానిఁ బరుని నతీంద్రియు నీకు దూరు సూక్ష్ము నే భజింతు(స్కం. 8. ప. 83) అనునది బ్రహ్మమైనవానిఁ బరుని నతీంద్రియు నీశు స్థూలు సూక్ష్ము నే భజింతు అని మా.స.త మక్షరం బ్రహ్మ పరం పరేశ మవ్యక్త మాధ్యాత్మికయోగగమ్యం, అతీంద్రియం సూక్ష్మ మివాతిదూర మనంత (మాద్యం) మీడ్యం పరిపూర్ణ మీడే (స్కం. 8. అ. 3. శ్లో. 21. చన్నపురీ బొంబాయీ ముద్రణములు రెండు నిట్లే) అని యున్నది గాన స్థూలు అను మాటకంటె దూరు అను మాటయే సంగతము. ఈపరిష్కర్తం బోలినవారే యొకరు స్థూలు అనునది సూక్ష్ము అను దానికి విరుద్ధము గాన సరియని తాళపత్త్రగ్రంథములో మార్చి యుండవలయు. అది నిర్మూలము.

53. ప్రణతుఁడై సంఫుల్ల, పద్మవదనుఁ డగుచుఁ బలికెఁ దెలియ (స్కం. 8. ప. 149) అనునది ప్రణతుఁడై సంఫుల్ల, పద్మనయనుఁ డగుచుఁ బలికెఁ దెలియ అని మా. సం. ఉవాచోత్ఫుల్లవదనో దేవాన్ స భగవాన్ పరః (స్కం. 8. అ. 5. శ్లో. 20. చన్నపురీ బొంబాయి ముద్రణములు రెండు నిట్లే) అని యున్కింజేసి సంఫుల్లపద్మవదనుఁ డగుచు అనుటయే సరి. సంఫుల్లపద్మనయనుఁ డనుట నిర్మూలము.

(స్కం-8-అ-14-శ్లో-10 ముద్రణములు రెండు నిట్లే) గుణంబు లనుమాట మూలమందు లేదు. కానఁ బడఁడు అనుటయే మూలానుసారి గాన యుక్తము

58. వైదికజ్ఞానయుక్తియుం వైరిజయము, నిన్నుఁ గొలువనినరులకు నెఱయఁగలదె (స్కం-8-ప-483) అనునది వైదికజ్ఞానమును ముక్తి వైరిజయము, నిన్నుఁ గొలువనినరులకు నెఱయఁగలదె అని మా. సం. ఆయుః పరం వపు రభీష్ట మతుల్యలక్ష్మీ ర్ద్యౌ ర్భూరసా స్సకలయోగగుణా స్త్రివర్గః, జ్ఞానంచ కేవల మనంత భవంతి తుష్టా త్త్వత్తో నృణాం కిము సపత్నజయాదిరాశీః (స్కం-8-అ-17-శ్లో-10) ఇందు ముక్తి అనుమాట లేదు. కాన యది యనావశ్యకము.

59. అంత హరిహృదయంబెఱింగి తార్క్ష్యనందనుండు యాగసుత్యాహంబున వారుణపాశం బుల నసురవల్లభునిబంధించె నంత (స్కం-8-ప-638) ఇందున్న హరిహృదయంబు అను దానియందు హరి అనుమాట వదలఁబడినది. సం. అధ తార్క్ష్యసుతో జ్ఞాత్వా విరాట్ప్రభుచికీర్షితమ్, బబన్ధ వారుణైః పాశైః (స్కం-8-అ-22-శ్లో-27) ఇందలి ప్రభుచికీర్షితమ్ అనుదానికి హరిహృదయంబు వ్రాయఁబడినది. హరి అనుమాట లేకున్న నర్థము చక్కఁగా స్ఫురింపదు.

60. ఉ. కన్నులు గల్గువాఁడు మఱి కాననివానికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్న తెఱంగు మూఢునకు సన్మతి దా గురుఁ డౌట సూర్యుఁడే
కన్నులు గాఁగ భూతములఁ గాంచుచు నుండురమేశ మాకు ను
ద్యన్నయమూర్తి వై గురువ వై యలసద్గతిఁజూడఁ జూపవే. (స్కం-8-ప-722) అనునది

ఉ. కన్నులు లేనివాఁడు మఱి కాననివానికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్న తెఱంగు మూఢున కసన్మతి దా గురుఁ డౌట సూర్యుఁడే
కన్నులు గాఁగ భూతములఁ గాంచుచు నుండురమేశ మాకు ను
ద్యన్నయమూర్తి వై గురువ వై యలసద్గతిఁజూడఁ జూపవే. అని మా.

చన్నపురీ ముద్రణమందు సం. సచక్షు రంధస్య యథాగ్రణీః కృత స్తథా జన స్యావిదుషో బుధో గురుః, త్వమర్కదృ క్సర్వదృశాం సమీక్షణో వృతో గురు ర్న స్స్వగతిం బుభుత్సతామ్. బొంబాయీ ముద్రణమందు, అచక్షు రంధస్య యథాగ్రణీః కృత స్తథా జనస్యావిదుషో௨బుధో గురుః, త్వమర్కదృ క్సర్వదృశాం సమీక్షణో వృతో గురు ర్నః స్వగతిం బుభుత్సతామ్. అని యున్నది. పైరెండుపాఠంబులయం దేపాఠము సమీచీనమో విద్వాంసులే పర్యాలోచింపవలయు. శ్లోక ప్రథమార్ధము ద్వితీయార్ధమునకు దృష్టాంతముగా నున్నది. అచక్షుః అని యీపాఠ ముండుట యాలోచనీయము. గ్రుడ్డివానికి గ్రుడ్డివాఁడు దారి సూపుట కెట్లు పలునుపడు. వ్యాఖ్యానమందు పూర్వభాగము దృష్టాంతమని స్పష్టముగా వ్రాయఁబడినది. ఈశ్వరుని గ్రుడ్డివానినిగాఁ జేయుట కేవలముఁ జింత్యము. అట్లగుటం జేసి చన్నపురీ ముద్రణమునందలి పాఠమే యార్యసమ్మతమనవలయు. కావున నిట్లు కన్నులు లేనివాఁడు......జూడఁ జూపవే. అని మార్చుట సాధుసమ్మత మగునా, పర్యాలోచించునది.

61. కొందఱు మంత్రులుగూడ రా సైంధవంబయిన గుఱ్ఱముసెక్కి యందమైన (స్కం-8-ప-16) ఇందలి కొందఱు మంత్రులు అనునది కొందఱుభృత్యులు అని మా. సం. స ఏకదా మహారాజ విచరన్ మృగయాం వనే, వృతః కతిపయామాత్యై రశ్వ మారుహ్య సైంధవమ్ (స్కం.-9-అ-1-శ్లో-23. రెండుముద్రణములు నిట్లే) అనియున్నది గాన మంత్రు లనుటయే మూలానుయాయి.

62. ఉత్తరాపథంబునకు రక్షకులైరి (స్కం. 9. ప. 42) అనునది ఉత్తరాపథంబునకు రాజులైరి అని మా. సం. ఉత్తరాపథగోప్తారో బ్రహ్మణ్యా ధర్మవత్సలాః (స్కం. 9. అ. 2 శ్లో. 16. రెండు ముద్రణములు సట్లే) అని యున్నది కాన గోప్తారః అనుటకు రక్షకులు అనుటయే మేలు.

63. ధృష్టునివలన ధార్ష్టంబను వంశంబు గలిగి భూతలంబున బ్రహ్మభూయంబు నొంది నెగడె. (స్కం-9-ప-42) ఇందలి భూతలంబున బ్రహ్మభూయంబు నొంది నెగడె అనునది భూతలంబున బ్రహ్మణ్యంబై నెగడె అని మా. సం. ధృష్టాద్ధార్ష్టమభూత్ క్షత్రం బ్రహ్మభూయం గతం క్షితౌ (స్కం. 9. అ. 2. శ్లో. 17) అని యున్నది కాన బ్రహ్మభూయంబునొంది నెగడె అనునదియే మేలు.

64. మీర లియ్యాశ్రమదూషణంబు సేయ నోపుదు రది (స్కం. 9. ప. 53) అనునది మీర లియ్యాశ్రమంబున నకృత్యంబు సేయ నోపుదురు అని మా. సం. వ్యక్తం కేనాపి నస్తస్య కృతమాశ్రమదూషణం (స్కం. 9. అ. 3. శ్లో. 6) అనియున్నది కాన యాశ్రమదూషణంబు అనుటయే యుత్తమము.

65. సూర్యతేజంబున సొంపారు నరు. గని వీఁ డెవ్వఁడో దీనివిభుఁడు గాఁడు (స్కం. 9. ప. 62) ఇందలి నరుఁగని అనునది వరుఁగని అని మా. సం. దదర్శ దుహితుః పార్శ్వే పురుషం సూర్యవర్చసం (స్కం. 9. అ 3 శ్లో. 18) పురుషం అని మూల మందున్నది కాన నరుఁగని అనుటయే మేలు.

66. క్రేపులయొఱ్ఱు నాఁకుచును రంగచ్ఛేలలై యున్నమం, దాలక్ (స్కం. 6. ప. 92) ఇందలి రంగచ్ఛేలలై యునది రంగచ్ఛాయలై అని మా. సం. గవాం రుక్మవిషాణానాం రూప్యాంఘ్రీణాం సువాససాం (స్కం-9-అ-4-శ్లో-36. బొంబాయి ముద్రణమందు 33 వ శ్లోకము) సువాససాం అని యున్నది గాన రంగచ్ఛాయలై అనునది నిర్మూలము.

67. ఆఁకట మలమల మాడుచు, వీఁక నతం డడవి నున్న విప్రమిథునముఁ (స్కం-9-ప-241) అను దానియందలి అడవినున్న విప్రమిథునముఁ అనునది అడవిఁ దిరుగు విప్రమిథునముఁ అని మా. సం. వ్యవాయకాలే దదృశే వనౌకౌ దంపతీ ద్విజౌ (స్కం-9-అ-9-శ్లో-26) బొంబాయి ముద్రణమందు 25 వ శ్లో) ఇందలి వనౌకః అనుదానికి అడవినున్న యనుటయే రమ్యము.

68. ప్రస్కందుండు మొదలగు బ్రాహ్మణులను జన్మించిరి. (స్కం-9-ప-593) అనునది ప్రస్కందుండు మొదలగు బ్రాహ్మణజాతులను జన్మించిరి. అని మా. సం. తస్య మేధాతిథి స్తస్మాత్ప్రస్క(ణ్వ)న్నాద్యా ద్విజాతయః (స్కం-9-అ-20-శ్లో-7) ఇందలి ద్విజాతయః అనుదానికి బ్రాహ్మణులు అని యర్థమేగాని బ్రాహ్మణజాతులు అని కాదు. ఇట్లు సవరించుట ఎట్లు లించుకు.

69. ధనములనొంది యుదారవృత్తి (స్కం-9 ప-702) అనునది ధనముల నమ్మ కుదారవృత్తి అని మా. సం. అనష్టవిత్తస్మరణో బుభుజేఽక్షయ్యషడ్వసు (స్కం-9-అ-23-శ్లో-26) అనష్టవిత్తస్మరణః అనుదానికి ధనస్మరణంబు నశింపక అని అర్థము. అనఁగా ధనముల నొంది అని చెప్పవలయునే గాని ధనముల నమ్మక అని చెప్పరాదు.

70. వారలకు ధృతదేవయు శాంతిదేవయు నుపదేవయు శ్రీదేవయు దేవరక్షితయు సహదేవయు దేవకియు ననఁ దోఁబుట్టువు లేడ్వురు గలిగిరి వినుము. (స్కం-9-ప-712) అను దానియందలి అనఁ దోఁబుట్టువు లేడ్వురు గలిగిరి అనునది అనఁ బరఁగినకూఁతు లేడ్వురు గలిగిరి అని మా. ఇందుఁ దోఁబుట్టువులఁ గూఁతులనుగా గ్రహించుట యాచారంబు గాఁబోలు. ఇది యెంతయు

వింత దీవికి సంస్కృతము. తేషాం స్వసార స్స ప్తాసన్ ధృతదేవాదయో నృప (స్కం-9-అ-24-శ్లో-23) ఇందు స్వస అనుటకుఁ దోఁబుట్టువే కాని కూఁతురు కాదు.

71. అని మఱియుం సామరూపంబు లగుపలుకులు వలికిన (స్కం-10-పూ-ప-35) అనునది అని మఱియు సామ భేదంబు లగుపలుకులు పలికిన అని మా. సం. సాంత్వయామాస వై శౌరి ర్బహుమానపురస్సరమ్ (స్కం-10-అ-1-శ్లో-12) అనుటకు సామరూపంబు లగుపలుకులు వలికిన అనుటయే సరి.

72. అని యిట్లు కీర్తించినగుహ్యకులం జూచి నగుచు (స్కం-10-పూ-ప-409) అనునది అని యిట్లు కీర్తించి నమస్కరించిన గుహ్యకులం జూచి నగుచు అని మా. సం. ఇత్థం సంకీర్తిత స్తాభ్యాం భగవాన్ గోకులేశ్వరః (స్కం-10-అ-10-శ్లో-40) ఇందు నమస్కరించిన అని యర్థమిచ్చుమాట లేదు.

73. అబ్బాలకులు మేఘశ్యాములును హార కుండల కిరీట వనమాలికాభిరాములును శ్రీవత్స మంగళాంగద నూపురకనకకటకకంకణకటిఘటిత కాంచీగుణోద్దాములును (స్కం-10-పూ-ప-536) అనునది అబ్బాలకులు మేఘశ్యాములును హారకుండల కేయూర కిరీట వనమాలికాభిరాములును శ్రీవత్స మంగళాంగదనూపుర కనకకటకకంకణకటిఘటిత కాంచీగుణోద్దాములును అని మా. సం. వ్యదృశ్యంత ఘనశ్యామాః పీతకౌశేయవాససః. 46. చతుర్భుజా శ్శంఖచక్రగదారాజీవపాణయః. కిరీటినః కుండలినో హారిణో వనమాలినః. 47. శ్రీవత్సాంగద దోరత్న కంబుకంకణపాణయః, నూపురైః కటకైర్భాజిత్కటిసూత్రాఙ్గుళీయకైః. 48. అంఘ్రిమస్తక మాపూర్ణతులసీనవదామభిః. 49. (స్కం-10-అ-13-శ్లో-46-47-48-49) ఇందు కిరీటినః అని యుండుటావులో కేయూర అని మార్చఁబడినది. మార్చఁబడినను చింత లేదు. పరల మంగళాంగద అని చెప్పుటచే అంగదశబ్దము గ్రహింపబడినది. కావున కేయూరాంగదశబ్దములు రెండును గ్రహింపఁబడినవి. రెండు (కేయూరమఙ్గదం తుల్యే అని నిఘంటువు) నేకార్థంబులే కావున పునరుక్తము. ఇది సంస్కృతమున లేదు. ఇట్లు మార్పు పరిష్కర్తకుం గలనేర్పు.

74. విషజలంబునలన విషధరదానవువలన (స్కం-12-పూ-ప-1038) అనునది విషజలంబునలన విషధరదానవివలన అని మా. సం. విషజలాశయా ద్వ్యాళరాక్షసాత్ (స్కం-10-అ-31-శ్లో-3) అని యున్నది. కాన వ్యాళరాక్షసాత్ అనఁగా విషధరదానవి కాదు. పుంలింగశబ్దమైన విషధరదానవునియే గ్రహింపవలయు. అఘాసురుఁ డజగరరూపమున వ్రేల మ్రింగునట్టివిషయము దశమస్కంధ పూర్వభాగమందు 468 మొదలు 484 దాఁక గలపద్యములలోఁ దెలుపఁబడియున్నది.

75. మొదటిమేను గాంచెదవు మూఢుండ పొమ్మని రాదయానిధుల్ (స్కం-10-పూ-ప-1116) అనునది మొదలిటిమేను గాంచెదవు మూఢుండ పొమ్మని రోదయానిధీ. అని మా. సం. శాపో మేఽనుగ్రహాయైవ కృత స్తైః కరుణాత్మభిః (స్కం-10-అ-34-శ్లో-14 రెండుముద్రణములు నిట్లే) కావున పొమ్మని రాదయానిధుల్ అనుటయే సరి.

76. అభ్యజ్యమానలై జలంబు లాడకయుం అనుదానికి అభ్యంజమానలై జలంబు లాడకయుం అనియున్నవి. సం. అభ్యజ్యమానా అకృతోపమజ్జనాః (స్కం-10-అ-41-శ్లో-26) కావున మొదటిదే సరి, రెండవది తప్పు.

77. వచ్చురాఁగకారుం డగునొక్కరజకుం గని (స్కం-10-పూ-ప-1258) అనునది వచ్చువాని నొక్కరజకుం గని అని మా. సం. రజకం కంచి దాయాంతం రంగకారం గదాగ్రజః (స్కం-10-

అ-41-శ్లో-32) వ్యాఖ్యయందు వస్త్రాణాం రాగ మపి కుర్వన్ రంగకారః అనియున్నది. కావున రా కారుం డనుమాట వదలుట బేలతనము.

78. కర్ణాటక దేశంబుల నలుపు గలిగి మనోజవంబులును శుక్లవర్ణంబులు నైనతురంగంబుల వ ఖుం డొసంగె (స్కం-10-పూ-ప-1611) అనుదానియందలి శుక్లవర్ణంబులు అనునవి శుక్లారుణ వర్ణంబులు అని మా. సం. శ్యామైకకర్ణాన్ వరుణో హయానాం చ్ఛుక్లాన్ మనోజవాన్ (స్కం-10 అ-50-శ్లో-54 బొంబాయిముద్రణమందు 56) ఈశ్లోకమందు శుక్లవర్ణము చెప్పఁబడినదే గాని శుక్లా రుణవర్ణంబులు చెప్పఁబడవయ్యె. అరుణవర్ణంబు గ్రంథపరిష్కర్తకు నెట్లు స్ఫురించెనో విస్మయావహ మై యున్నది

79. గ్రాహ్య గ్రాహక గ్రహణంబు లనుత్రివిధభేదంబులుం గలిగిన (స్కం-11-ప-52 అనునది గ్రాహ్య గ్రాహక గ్రాహిత్వంబు లనుత్రివిధభేదంబులు గలిగి అని మా. సం. విశుద్ధం జ్ఞాన మేవైకం మాయయా భాసతే త్రిధా, గ్రాహకాద్యైర్యథా స్వప్నే యత్ర సంవిల్క్రియాఫలమ్ (స్కం-11-అ-3-శ్లో-5) వ్యాఖ్యయందు గ్రాహకగ్రహణగ్రాహ్యాణి. స్వప్నః స్వప్నావస్థా సంవేత్తీతి సంవిత్ సంవేత్తా. క్రియాసంవేదనం ఫలం సంవేద్యం ఈప్సితతమత్వాత్. అని యున్నది కావున మొదటిదానియం దుండునదే సరి.

80. చతుర్థస్కంధమందు కరిపెన సంఖ్య గలవచనంబున పం బంతికిఁ దర్వాత "స్తంబు నను భవించు వందంబునం బురుషుం డేలింగశరీరంబునం జేసి కర్మంబు" అనుబంతి ముద్రింపఁ బడవయ్యె. ఇట్లు బంతియొకింతసు ముద్రింపఁబడకుండుట చూడఁగాఁ బరిష్కర్తృత్వం గలవారిరూకత యింతనట్టని తెలియనగును.

మీఁద వివరింపఁబడినవే కాక ఛందోవిషయంబులైనస్ఖాలిత్యంబులు వ్యా కరణ విరుద్ధప్రయోగంబులు గలుగున ట్లెన్ని యెడలనో మార్పఁబడినవి. అదోష ములుగా నున్నను సదోషములుగా గ్రంథములమార్చుట యనపేక్షణీయంబు. ఈవిషయంబునకుఁ గొన్ని యుదాహరణంబులు దెలుపఁబడియెడు

ప్రాసభంగమున కుదాహరణములు.—

81. క. ఒకవృక్షమూలతలమున, నకలంకగుణాభిరాముఁ డాసీనుం డై
యకుటిలమతి బదరీవని, కేఁక నీ వరుగు మని మొఱఁగ యేఁగిరి నేఁడున్.

స్కం. 3. ప. 141 అనునది

క. ఒకవృక్షమూలతలమున, నకలంకగుణాభిరాముఁ డాసీనుం డై
యకుటిలమతి బదరీవన,మునకును బొమ్మనుచు మొఱఁగి పోయిన నేఁడున్. అనిమార్పఁబడినది

82. ఉ. తెంపరి వై పొరింబొరిని దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం, జంపితి వంశ నైన నుపశాంతి వహింపక తాలమీఁద నొ, ప్పింపఁగ నిప్పిరో యిదిఁగను నీరమె నాసరసన్ జనించి నిన్, జంపెడి వీరుఁ డొక్కఁడెస సత్కృతి నొందెడువాఁడు దుర్మతీ. (స్కం-10-పూ-ప-154) అనునది ఉ. తెం పరివై పొరింబొరిని దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం, జంపితి వంశనైన నుపశాంతి వహింపక తాలమీఁద నొ,ప్పించితి నిప్పిరో యిదియు బీరమె నాసరసన్ జనించి నిన్, జంపెడివీరుఁ డొక్కఁడెస సత్కృతి నొందెడువాఁడు దుర్మతీ. అని మార్పఁబడినది.

గణభంగమున కుదాహరణములు:—

83. తే. ఇన్నియుఁదెలియ నానతి యిచ్చి నన్ను, నర్థి రక్షింపు యజ్ఞదానాదిపుణ్య (స్కం-3-ప-260) అనునది తే. ఇన్నియును జెలియ నానతి యిచ్చి నన్ను, నర్థి రక్షింపు యజ్ఞదానాదిపుణ్య, అని మార్పఁబడినది.

84. తే. రూఢి నమ్మనువుకు శతరూపవలన, భూనుతు లగుప్రియవ్రతోత్తానపాదు (స్కం-4-ప-217) అనునది తే. రూఢి నమ్మనువునకు శతరూపవలన, భూనుతు లగుప్రియవ్రతోత్తానపాదు, అని మార్పఁబడినది.

85. తే. సాధనాయ పురాపురుషాయ యజ్ఞ, రేతసే జీవతృప్తాయ పృథ్వీరూప (స్కం-4-ప-702) అనునది తే. సాధనాయ పురాణపురుషాయ యజ్ఞ, రేతసే జీవతృప్తాయ పృథ్వీరూప, అని మార్పఁబడినది.

86. తే. పరమునికి వందన మొనర్తుఁ బరిఢవించి, మున్నవితథానుభూతికి మ్రొక్కికొందు (స్కం-6-ప-213) అనునది తే. పరమునికి వందనము సేతుఁ బరిఢవించి, మున్నవితథానుభూతికి మ్రొక్కికొందు, అని మార్పఁబడినది.

87. తే. లలితరేఖలు ధరణి నలంకరింప, నుద్ధవునికరతల మూని యొయ్య నడచి (స్కం-10-ఉ-భా-ప-639) అనునది తే. లలితరేఖలు ధరణి నలంకరింప, నుద్ధవునికరతలం బూని యొయ్యనడచి, అని మార్పఁబడినది.

యతిభంగమున కుదాహరణము:—

88. సీ. మనుట నిత్యము గాదు మరణంబు నిజమని యెఱిఁగి మోక్షస్థితి నిచ్ఛగించు (స్కం-1-ప-393) అనునది సీ. మనువు నిత్యము గాదు మరణంబు నిజ మని,యెఱిఁగి మోక్షస్థితినిశ్చయించు అని మార్పఁబడినది.

వ్యాకరణవిరుద్ధప్రయోగముల కుదాహరణములు:—

89. మొనసి నిరాహార భావమున దేవనదీ (స్కం-1-ప-204) అనునది మొనసి నిరాహారిభావమున దేవనదీ, అని మార్పఁబడినది. నిరాహారి యనురూప మెట్లువచ్చె?

90. అమ్మేధాత్మకు లోకయింతయుఁ, గ్రోధముఁ దేరైరి సత్త్వగుణసంగతులై (స్కం-2-ప-130) అనునది అమ్మేధాత్మకు లోకయింతయుఁ, గ్రోధముఁ దేరైరి సత్త్వగుణయుక్తులరై, అని మార్పఁబడినది. ఇందిలి సత్త్వగుణయుక్తులు అను ప్రథమపురుషాంతవిశేషణమునకు అరై అనునది యెట్లు చేర్పఁబడియె?

91. చేయవలయునంటివె యనయంబును (స్కం-4-ప-572) అనుదానికి మాఱు చేయవలయు నంటివి యనయంబును అని యుండుటచే మధ్యమపురుషక్రియాంతి మేత్తునకు సంధి లే దయ్యెఁగదా. ఇది యెట్లు పొసఁగు?

92. బలి నంభోరుహనేత్రుఁ డేమిటికినై పాదత్రయిన్ వేఁడె (స్కం-8-ప-137) అనునది బలి నంభోరుహనేత్రుఁ డేమికోఱకై పాదత్రయిన్ వేఁడె, అని మార్పఁబడినది. ఇది యనౌపవిభక్తి కాంతముగా నెప్పుడైనఁ బ్రయోగంబులం జూపట్టెడినే?

93. ఆ. వికచకమలనయన వేతొ్రోకయింటిలో, వెలయ తోలు దిరుగ వేసి యెక్కి (స్కం-10-పూభా-ప-36) అనునది ఆ. వికచకమలనేత్రి వేతొ్రోకయింటిలో, వెలయ తోలు దిరుగ వేసి యెక్కి, అని మార్పఁబడినది. వికచకమలనేత్రి యనురూపము సాధువా?

94. అభ్యజ్యమాన లై జలంబు లాడకయుం (స్కం-10-పూభా-ప-1247) అనుదానికి మాఱు అభ్యంజమానలై జలంబు లాడకయు అని యున్నది. అభ్యంజమాన అనురూపమెట్లు గలిగె? అర్థము పొసఁగియున్నె?

95. సీ. పరమబంధుఁడుగాని పగయ కాఁడు (స్కం-10-ఉభా-ప-751) అనుదానికి మాఱు సీ. పరమబంధుఁడు కాని పగఱ కాఁడు అనియున్నది. ఏకవచనమున పగఱ అనునది వ్యాకరణసమ్మతమా? పగ=పగవాఁడు, విరోధి.

ఉదా.—మనకుం బగ యింద్రుఁడ కాఁడె యెల్లభంగులఁ దలఁపఁ.

(నిర్వచనోత్తరరామాయణము.)

మీఁద నుదహరింపఁబడినవి గాక ముద్రణస్ఖాలిత్యము లెన్నియేనిఁ గలవు అవి యంతగాఁ బాటింపఁ దగినవి కావు కావున వాని నిందుఁ దెలుప నూను కొంటిని. 'ప్రమాదో ధీమతా మపి' యనున్యాయము ననుసరించి యెట్టివారికేనిఁ బ్రమాదంబు గలుగవచ్చుఁగాని వలయు నని మార్చినకతంబుననే నింతలుగఁ దెలుపవలసె. ఇదియ యీగ్రంథంబు నచ్చొత్తింపం గలప్రధాన కారణంబు

ఏను సర్వకళాశాలను వదలి పోవలసియుఁ గార్యాంతరవ్యాసక్తి యని వార్యంబుగ సంభవించియు నాకు వలసినంతయవకాశంబు లేమింజేసి యాగ్రంథము మిక్కిలిచక్కఁగా శోధింపఁగానీ పీఠిక విరివిగ లిఖింపంగాని వలనుపడదయ్యె.

ఈగ్రంథంబు నొక్కపర్యాయమే సవరించి యిచ్చితిని గాని ముద్రించునప్పుడేను శోధించినవాఁడంగాను. అతివేగముగాముద్రింపఁబడినదిగాన ఇందునుగొన్ని తప్పిదంబు లుండవచ్చును. ఉన్నను నార్యులు గుణగ్రహణంబుగావించి మించినకరుణమై నన్నును మన్నించి కవికిం గలనిరతిశయభక్త్యుద్దీపకకవిత్వమహత్త్వంబు మథించి తదాస్వాదనంబు గాంచి పరమానందంబునం బొందుదురు గాక!

అని ప్రశ్రయంబుగ విన్నవించు

రాయదుర్గము, నరసయ్యశాస్త్రి,

క్రైస్తవ సర్వకళాశాలా ప్రధానాంధ్రపండితుఁడు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# ఆంధ్ర భాగవత విమర్శము.

అభిరూపశేఖరులారా !

మహాకవి యగుబమ్మెరపోతరాజుకవితాప్రాగల్భ్య మాబాలవేద్యంబు ఇమ్మహనీయునివలె భక్తిరసోద్బోధకముగ నుద్గ్రంథము వ్రాసినపరమార్థాకాంక్షి యాంధ్రవాఙ్మయమున వే ఱొక్కఁడు లేఁడు. ఆంధ్రవాఙ్మయమున గలగ్రంథములలో భారతభాగవతరామాయణము లుత్తమోత్తమగ్రంథములు. అందు భాగవతము త్యాగశీలుఁడు సహజపాండిత్యుఁడు నగుపోతరాజమహాకవిచే నాంధ్రీకృతంబైనది ఈకవి స్వతంత్రశీలుఁడు. వాఙ్మయరహస్యవేత్త రసపోషణంబున నాఱితేఱినవాఁడు ఉభయవాఙ్మయముల మేళవించి కూర్పుల గూర్చుటయం దసమానుఁడు సమకాలికులగు రాజన్యులకు లోనయి స్వతంత్రజీవనమున కంతరాయము గలిగించుకొనుటకుఁ బ్రతిఘటించిన జీవన్ముక్తుఁడు ఇట్టిలోకోత్తరునిపవిత్రగ్రంథము పఠించి కృతార్థతనొందినందులకుఁగృతజ్ఞతాసూచకముగఁ గొండొకపీఠిక వ్రాసి యాధునికపరిశీలనమున లభించినయాధారములతోఁ గవికాలము నివాసాదికము కవితావిమర్శము నించుకఁ జేయ సాహసించుచున్నారము.

పోతరాజు కాలనిరూపణముఁ జేయుటలోఁ జరిత్రకారులు తలకొకత్రోవఁ ద్రొక్కి యున్నారు. కవికాలనిరూపణమున కను వగుశాసనాద్యాధారములు నేఁటివఱకు లభింపకుంటచే నీయూహానిర్ణయమునం దెంతవఱకుఁ గృతార్థులము కాఁగలమో తెలుపఁజాలము చిరకాలపరిశ్రమముచే మేము సత్యమని విశ్వసించిన యంశ మించుక వాకొని ప్రకృత మనుసరింతుము.

పూర్వపీఠికాకారులు పోతరాజుజీవితకాలము క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతమని నిరూపించిరి. కీర్తిశేషు లగువీరేశలింగముపంతులవారు ౧౪౭౫ వ కావలివాఁడని క్రొత్తకూర్పులో సవరించియున్నారు. చిలుకూరివీరభద్రరావుపంతులువారు వేఱొకవిధముగ వ్రాసిరి. పోతరాజు వీరలంద ఱుదాహరించినంతకంటెఁ బూర్వకాలమున నున్నటులఁ గొన్ని యాధారములు కానవచ్చుచున్నవి పోతరా జాంధ్రకవులలో నన్నయభట్టారకుని దిక్కనసోమయాజినిమాత్రమె ప్రశంసఁ జేసెను. శంభుదాసుని ప్రశంసఁగావింపఁకుంటచే నాతనికి సమకాలికుఁడో యాతనిరచనము వెల్లడికానంతటిసమీపకాలముననో యుండి యుండు నని విశ్వసింపవలయును. లేకున్న కవిద్వయమునె ప్రశంసింపవలసినప్రశస్తి తటస్థింపఁజాలదు. ఇంతియగాక పోతరాజు కవి

చక్రవర్తి యనఁదగు నాచనసోమనాథున కించుక యనంతరకాలమువాఁడు. సుప్రసిద్ధకవి యగు మడికి సింగనకవికిఁ బైకాలమువాఁడునై యుండెను. కాన నీయుభయకవుల మధ్యకాలమున నున్నటుల స్థూలదృష్టిచేతను సులభలబ్ధము లగునాధారములచేతను గూడ నిరూపింప నగును.

నాచనసోమనాథుని యుత్తరహరివంశములోని పద్యములఁ గొన్నింటిని పోతరాజనుకరించుటయే గాక మూలగ్రంథములో లేనిసత్యభామాసంగ్రామమును గూడ భాగవతమునఁ జేర్చికొనెను. ఉత్తరహరివంశకవితాచ్ఛాయలు భాగవతమున నందందుఁ గలవు దీనివలనఁ బోతరాజు నాచనసోమనాథునకు నవలివాఁ డనుట నిస్సంశయము నాచనసోమనాథునిజీవితకాలము క్రీ. శ ౧౩౭౦ ప్రాంతము.

పోతరాజు ననుకరించినప్రాచీనకవి మడికిసింగరాజు ఇతఁడు పోతరాజుభాగవతములో ఖిలమైనదశమస్కంధకథను ద్విపదకావ్యముగ వ్రాసియున్నాఁడు భాగవతములోనిపద్యముల ననుకరించి సింగన పద్మపురాణములోఁ బెక్కుపద్యములు వ్రాసియున్నాఁడు. వాని నుదాహరించుటచే గ్రంథవిస్తర మగును. సింగన పద్మపురాణములోని "మడికిసింగన తెనుంగున రచించెఁ దగఁ బద్మపురాణం బానసులకు త్రశీరాంశువు" అనుపద్యభాగముచే క్రీ శ. ౧౪౨౦ ప్రాంతమున నుండి యుండెను. పోతరాజో-ఈయిరువురుకవులకు మధ్యకాలమగు క్రీ. శ ౧౪౦౦ ప్రాంతములోఁ బ్రౌఢవయస్కుఁడై యుండి యుండును ఈనిర్ణయముచేఁ బోతరాజు సర్వజ్ఞసింగభూపాలునకు శ్రీనాథమహాకవికి సమకాలికుఁ డగుట తేటపడఁగలదు పోతరాజువలన భోగినీదండకము కృతినొందినవాఁడును భాగవతాంకిత మభిలషించినవాఁడు నగుసర్వజ్ఞసింగభూపాలుఁడు పిల్లలమర్రి బేతాళనాయని కేడవపురుషుఁడు. సోమకులపరశురామాదిబిరుదాంకితుఁ డగునసపోతరాజున కాత్మజుఁడు ఇతఁడును క్రీ శ. ౧౪౦౦ ప్రాంతమున నుండెను. సమకాలికుఁ డని చెప్పఁబడు శ్రీనాథమహాకవి నిశ్చితము క్రీ. శ ౧౪౧౮ నాటికి వేమభూపాలునివద్ద విద్యాధికారిగ నున్నట్లు, పానుగల్లి తామ్రశాసనములోని "విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః" అనువాక్యముచే వ్యక్తమగుచున్నది. ఇన్నింటిని సమన్వయించి పోతరాజు క్రీ శ ౧౪౩౦లో భాగవతము రచించియుండు ననియు భాగవతపూర్వము వ్రాసెను నిర్ణయించినటులఁ బోతరాజు క్రీ. శ ౧౩౭౮ ప్రాంతములలో జనించి యుండె ననుటయు సమంజసము. కవికాలనిరూపణమున కింతకంటెఁ బ్రబలాధారములు ప్రకృతము లభించుట లేదు.

ఈకవినివాసస్థలమునుగూర్చి చర్చలు బయలుదేరినవి. ఒకపక్షమువారీకవి దత్తమండలములలోని కడపజిల్లా ఒంటిమిట్టనివాసి యని శాసించుచున్నారు. మఱియొకపక్షమువారు నిజామురాష్ట్రములోని ఒరంగల్లుప్రాంతవాసి యని శాసించుచున్నారు. మఱికొందఱుతోఁచినతమయభిప్రాయము నెఱింగింపక కావ్యము విమర్శనీయముగాని నివాసస్థానము జీవితచరిత్రము విమర్శనీయము కా దనుచున్నారు.

ఐశ్వర్యజీవితమురోసి సహజదరిద్రజీవితమె వాంఛించి మదమత్తు లగుసమకాలికరాజన్యులపంచలలోఁబడి దేవిరింపక యున్నంతలోఁ దృప్తినొంది భాగవతమువంటి యుత్కృష్టగ్రంథము తెలుఁగుచేసిన పోతరాజు గౌరవార్హుఁ డనుట నిర్వివాదాంశము. ఇట్టిమహానుభావుని పాదధూళిచేఁ బునీతమైన యాపుణ్యక్షేత్రము-ఆపవిత్రభూమి-ఆవాఙ్మయరంగస్థలము దివ్యస్థలమువలె భాషాసేవకులను దర్శనీయ మనుటలో సాహసము లేదు. మహాత్ముల జీవితములచేఁ బునీతము లైన మథుర-అయోధ్యా-హస్తినలవలెఁ గవులజీవితముల కాధారభూతము లగునివాసస్థలములు సైత మొకప్పుడు యాత్రాస్థలములు కాఁగలవు అట్టి పవిత్రస్థలముల నిరూపింప నవకాశమును గలవారై పరిశీలకులు నిరుత్సాహులయ్యెద రేని భవిష్యదాంధ్రలోకమున కాపరిశీలకులు తీరనియాందోళనము గూర్చినవా రగుదురు కాన లభ్యమానము లగుకవినివాసాదికాధారములు ముఖ్యముగఁ జర్చనీయము లని మామతము.

పోతనామాత్యుని నివాసస్థలనిరూపణమునకుఁ జాలినన్ని యాధారములు లేవు. భాగవతములోన నీవివాదమును బరిష్కరింపఁదగినన్ని చరిత్రాంశములు కానరావు. ప్రధానగ్రంథమగుభాగవతమును ముందుఁ జర్చించి పిమ్మట గ్రంథాంతరముల కేగుట యుక్తము.

భాగవతములో "మఱలి కొన్ని దినంబులకు నేకశిలానగరంబునకు వచ్చి" అని యేకశిలానగరము ప్రశంసింపఁబడి యున్నది. ఇదియె ఒంటిమిట్ట యని కొందఱు వివరించుచున్నారు. ఏకశిలానగరపదము ఒంటిమిట్ట యను తెనుఁగుఁబదమునకు సంస్కృతీకరణము కాఁజాలదు. అయ్యలరాజు రామభద్రుఁడు, అయ్యలభాస్కరకవులు లోనగువారు ఒంటిమిట్ట యని యేతమతమ గ్రంథములలో వ్యవహరించియున్నారు. ప్రాచీనశాసనములయందు గ్రంథములయందు ఒంటిమిట్టను ఏకశిలానగర మని వ్యవహరించినటుల నాధారములు కానరాకుంటచే నీయేకశిలానగరము తద్భిన్నస్థలముగ నిశ్చయించి తీఱవలయును. కాకతీయచక్రవర్తులనాఁటిశాసనములు ప్రతాపరుద్రయశోభూషణము, క్రీడాభిరామము లోనగుగ్రంథములవలన ఒరంగల్లునకు ఏకశిలానగర మనుసంస్కృతనామ మున్నటుల సువ్యక్తమగుచున్నది. చిరకాలమునుండి ఒరంగల్లునకు ఏకశిలానగర మనునామము గ్రంథస్థమై సుప్రసిద్ధమై యున్నది. ఒరంగల్లు అను పదమునకు ఏకశిలానగర మనుసంస్కృతీకరణ మెంతయు నొప్పియున్నది. పోతరాజుకాలమునాఁటికి ధారాళముగ నోరంగల్లు ఏకశిలానగర మని వ్యవహరింపఁబడుచున్నది. అంతకుమున్ను మహాకవులు రాజులు నానామము నెవ్యవహరించి యున్నారు. ఒంటిమిట్టను బోతరాజుసమకాలికులుగాని యంతకుఁ బూర్వులుగాని యంతదనుక నేల ఒకశతాబ్దమునకుఁ బూర్వమున నున్నవారుగాని యేకశిలానగర మని వ్యవహరించి యుండలేదు. "అప్రయుక్తత్వాత్ దోషః" అనునియమము ననుసరించియు నంతకుమున్నట్టినామాంతరవ్యాప్తి లేకపోవుటంబట్టియుఁ బోతననివాసనిరూపణమునకు వలయునన్ని యాధారములు నిజామురాష్ట్రమునందె-ఒరంగల్లుచుట్టుపట్టు

లనె లభించుటచేఁ బోతరాజు పేర్కొనిన ఏకశిలానగరము ఒరంగల్లె యని నిశ్చయించుట ప్రమాదము కాఁజాలదు. ఈయూహతో సుప్రసిద్ధపరిశోధకు లగురాయబహాదూరు వీరేశలింగముపంతులువారు చిలుకూరి వీరభద్రరావుపంతులువారు జయంతి రామయ్యపంతులువారు కే. వి లక్ష్మణరావుపంతులువారు వారు వీ రనేల సుప్రసిద్ధులగు నాంధ్రులందఱు నేకీభవించియే యున్నారు.

ఒరంగల్లుచెంత బమ్మెర యనునొక గ్రామము కలదు. ఆగ్రామమునందుఁ గౌండిన్యసగోత్రు లగునియోగులకుటుంబ మొక్కటి కలదు. వారు పోతనామాత్యుఁడు తమవంశీయుఁడని చెప్పుకొనుచున్నారు ఈబమ్మెరలోఁ బోతరాజుగద్దె యని నాలుగుతాళ్లుప్రాఁతిన యొకస్థలము కలదు అది ప్రస్తుతము జీర్ణమై నామమాత్రావశిష్టముగ నున్న యొక రామాలయమున కెదురుగ నున్నది దానిముందుగఁద్రోవ కడ్డముగ నొకశిల పడియున్నది. దానినె యచటివారు బమ్మెరపోతరా జని వ్యవహరించియున్నారు. నేఁటికి బమ్మెరలోనున్న కౌండిన్యసగోత్రులాశిలను శుభావసరములలోఁ బూజించుచు నది పోతనరూపవిగ్రహ మనియుఁబోతరా జాగ్రామములో నిభూములు దున్నె ననియుఁ దెలుపుచున్నారు ఆబాలగోపాల మచటివారు పోతరాజాబమ్మెరలో నుండెనని విశ్వసించి పరంపరగఁ జెప్పుకొనుచున్నారు ఇవి యన్నియు సత్యేతరము లనుటకంటె సాహస ముండదు ఇంతియగాక ఒరంగల్లుప్రాంతములలో బమ్మెర వారను నియోగులు కౌండిన్యగోత్రులు కలరు. వారందఱు పోతరాజు తమపూర్వుఁడని చెప్పుకొనుచున్నారు. భాగవతములోని స్కంధములు పూర్తిగావించిన యితరకవులుగూడ నొరంగల్లుప్రాంతము వారె. పోతరాజు ప్రియశిష్యుఁ డగు వెలిగందలనారయకవి యచటకు నైదామడలదూరమున నున్న వెలిగందలనివాసి ఈవెలిగందలచరిత్రప్రసిద్ధమై కొండొక కాలమున నాంధ్ర రాజ్యమునకు ముఖ్యపట్టణము గూడ నైయున్నది. భాగవతషష్ఠస్కంధము పూర్తిచేసినటుల గద్యమువలనఁ దెలియును. ఏర్చూరుసింగన యచటికిఁ గొలఁదిదూరములో నున్న యేర్చూరునివాసి ఏకాదశద్వాదశ స్కంధములు వెలిగందలనారయకవి పూర్తిచేసినటులఁ దెలిసెడుం తెలియక యో క్రమ్మర రచించినహరిభట్టారకుఁడు నిజాము రాష్ట్రములోని కంభము మెట్టునివాసి యని యాతని వరాహపురాణమువలన సువ్యక్త మగుచున్నది. వెలిగందలనారయకు ముందు దశమస్కంధభాగమును ద్విపదగ వ్రాసిన మడికిసింగన ఒరంగల్లున కాఱామడలదూరములో నున్న రామగిరిలో నుండెను. దీనిచే భాగవతము రచించినకవియు భ్రష్టభాగములు పూర్తిచేసినవారును ఒరంగల్లుప్రాంతములవా రని సువ్యక్త మగుచున్నది. పోతరాజు భోగినీదండకము రచించి సర్వజ్ఞసింగభూపాలున కంకితము గావించినటుల దండకాంత్యమునఁ గల యీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

"ఉ. పండితకీర్తనీయుఁ డగుబమ్మెరపోతన యాసుధాంశుమా
ర్తాండకులాచలాంబునిధితారకమై విలసిల్ల భోగినీ

దండకముఁ రచించె బహుదానవిహర్తను రావుసింగ భూ
మండలభర్తకుఁ విమతమానవనాథమదాపహర్తకుఁ."

ఈసర్వజ్ఞసింగభూపాలుఁడు పిల్లలమఱ్ఱి బేతాళనాయని కేడవతరమువాఁడు. ఈతఁడు సోమకులపరశురామాదిబిరుదాంకితుఁ డగు అనపోతనాయనికుమారుఁడు. ఈయనపోతనాయఁడు రాచకొండ రాజధాని గావించికొని యందు నివసించినటుల రాచకొండశాసనములలో నీయంశమువలన స్పష్ట మగుచున్నది. ఇంతియగాక సింగభూపాలకృత మగురసార్ణవసుధాకరములోఁ గూడ

"రాజా సరాజాచలనామధేయా, మధ్యాస్తవంశక్రమరాజధానీం
సతాం చ రక్షా మసతాం చ శిక్షాం, న్యాయానురోధా దనుసందధానః."

నిట్లు తాను రాచకొండలో నివసించుచున్నటులఁ జెప్పుకొని యున్నాఁడు. ఈరాచకొండ బమ్మెరకు ఓరుగల్లులకొకదినములోఁ బ్రయాణము చేయఁదగినంతదగ్గఱలో నున్నది. ఈసర్వజ్ఞసింగభూపాలుఁడే పోతనామాత్యునిభాగవతము నంకితము కావలయు నని కోరినటులను బోతన నిరాకరించుటచే నాతఁడు దౌర్జన్యముగఁ గృతి నాఁచికొని పూడ్చివేయుటచే నది జీర్ణించినటుల నొకప్రవాదము గలదు. దానినె ఇప్పటికి శతాబ్దమునకుఁ బై కాలమున నున్న కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహములో నీవిధముగ గ్రంథస్థము గావించియున్నాఁడు.

"సీ. ఘనుఁడు పోతనమంత్రి మును భాగవతము రచించి చక్రికి సమర్పించునెడల
సర్వజ్ఞసింగయక్ష్మావరుం డది తన కిమ్మని వేఁడఁగా నీయకున్న
నలిగి యాపుస్తకం బవనిఁ బాతించినఁ జివికి యం దొకకొంత జీర్ణమయ్యెఁ
గ్రమ్మఱ నది వెలిగందలనారపరాజును మఱి బొప్పరాజు గంగ
తే. రాజు మొదలగుకవివరుల్ తేజ మెసఁగఁ, జెప్పి రాగ్రంథములయందె తప్పు లొదవెఁ
గాని పోతకవీంద్రునికవితయందు, లక్షణం బెందుఁ దప్పునా దక్షహరణ."

దీనిని బట్టిచూడఁ బ్రవాదములను భోగినీదండకమును బట్టిచూడఁ బోతరాజునకు సర్వజ్ఞసింగభూపాలునకు సంబంధ మున్నదనుట సత్య మని తోఁచును సర్వజ్ఞసింగ భూపాలుఁడు పోతరాజును సమీపప్రాంతములలో నుండియుండురు. లేకున్నఁ బరాశ్రయవిముఖుఁ డగుపోతరాజును నిర్బంధింపవలసినయవసరము సింగభూపాలునకుఁ దటస్థింపఁజాలదు పోతరాజే యొంటిమిట్టకుఁ జెందినవాఁ డైనచో నోరుగంటిచెంతనున్న సర్వజ్ఞసింగభూపతి కృతినొంద నెంచుటయు నోరుగంటిప్రాంత వాసు లగునితరకవులు భ్రష్టభాగములు పూర్తిచేయుటయుఁ గౌండిన్యసగోత్రు లగుబమ్మెరవారు ఓరుగంటిప్రాంతములలో నుంటయుఁ దటస్థింపఁజాలదు. ఈవిషయము నిర్ధారణముచేయ నింకఁ గొన్ని సాధనములు కలవు.

పోతరాజు బమ్మెరలో నివసించియుండి యోరుగల్లున భాగవతరచనమునకుఁ బండితోత్తములచే ననుజ్ఞాతుఁ డైనటుల భాగవతమువలనఁ దెలియవచ్చుచున్నది

"వ. ......శ్రీమన్నారాయణ కథాప్రపంచవిరచనాకుతూహలుండనై యొక్కరాకా
నిశాకాలంబున సోమోపరాగంబు రాకంగని సజ్జనానుమతంబున నభ్రంకషశుభ్రసము

తుంగభంగ యగుగంగకుం జని త్రుంకు లిడి వెడలి మహనీయపులినతలమంటపమధ్యం
బున మహేశ్వరధ్యానంబుఁ జేసి..............." భాగ-ప్ర-15.

ఇట్లు పోతరాజు సోమోపరాగంబున గంగ కేగినటులఁ జెప్పికొనియున్నాఁడు. పోతన చంద్రగ్రహణము లక్ష్యమునం దుంచికొని కాశి కేఁగెనని మనము నిశ్చయించుట యుక్తము కాదు. దీనికిఁ గొన్ని బాధకములు కలవు ఎట్టిప్రయాణసౌకర్యములు లేని యాకాలమునఁ బాదచారియై చంద్రగ్రహణమునకుఁ గాశి కేఁగ ననుట పొసగదు. దూరదేశ మగుటచే గమ్యస్థానముఁ జేరకముందె యొకపుడు గ్రహణము మార్గమధ్యమున గడచిపోవచ్చును. ఇదియుఁ గాక గ్రహణమునకుఁ గాశీగంగాస్నానమునకేగువారికి సర్వసౌకర్యములు గలయీకాలముననె లేరు గానఁ బోతరాజేగినది భాగీరథి కని నిరూపింప వీలులేదు సమీపమున నున్న యొక జీవనది కేఁగియుండును గోదావరికి గంగానామము రూఢమై యున్నది. ప్రాచీనకవిపుంగవులు గోదావరిని గంగ యని వ్యవహరించియే యున్నారు. గ్రహణాదులలోఁ గృష్ణాగోదావరులకు సమీపవాసు లేగుటాచారము నాఁటనుండి నేఁటివఱకు కలదు బ్రహ్మపురాణములోని గోదావరీమాహాత్మ్యమునఁ గోదావరికి గంగ యను నామాంతరమున్నట్లును గ్రహణకాలమున గోదావరిస్నానము పుణ్యప్రదమనియును జెప్పఁబడియున్నది

"మహేశ్వరజటాస్థాయా ఆపో దేవ్యో మహామతే
గౌతమేన శివం పూజ్య ఆహృతో లోకవిశ్రుతః
భగీరథేన భూపేన ఆహృతోంశోపరస్తథా
ఏవం ద్వైరూప్య మభవ ద్గంగాయాః మునిసత్తమ
బ్రహ్మహత్యాదిపాపాని మనోవాక్కాయికానిచ
స్నానమాత్రేణ సర్వాణి విజయం యాంతు శంకర
చంద్రసూర్యోపరాగేచ..............."

"ప్రాఁక్స్థితస్థిర యైనభవజూటవాహిని" కావ్యాలంకారచూడామణి.

"క. మందాకిని కేగి మహీ, నందన కమలములు గోసి నలువ్రన లీలం
జెంగ నున్నది లక్ష్మణ, పొందుగ నీ వచటికేగు భూమిజఁ గూడన్."
భాస్కరరామాయణము. అర. 307

"శ్లో. శీఘ్రం లక్ష్మణ జానీహి, గత్వా గోదావరీం నదీం
అపి గోదావరీం సీతాం..............."

అను వాల్మీకి రామాయణసూత్రకముబట్టిచూడ భాస్కరరామాయణమునందలి మందాకినియే గోదావరి యని తేలుచున్నది. గంగను మందాకిని యందురు గనుక గంగాగోదావరిపదములు భాస్కరరామాయణమతానుసారమున సమార్థకములు.

"గీ. అహహ జానకి నా కిపు డబ్బెనేని, యీజనస్థానమందాకినీజలములఁ
బ్రస్రవణగిరిఁ గేళ్కల రాజిలంగ, నేఁకటలు వాయఁ దిరుగనే యింతితోడ."
ఆంధ్రవాల్మీకిరామాయణము. (అరణ్య-1082.)

ఇందు మందాకినీశబ్దము గంగార్థమున రూఢమైనను గోదావరికిఁ బర్యాయ పదముగ నుపయోగింపఁబడియున్నది.

“చంద్రోపరాగసమయమునందు స్నానమొనర్చి దానంబు సేయువారు కిల్బిషహీనులై.”

“యోజనాయుతమయి పరగుగంగ” తాడూరి కృష్ణకవిప్రణీత గౌతమీమాహాత్మ్యము.

(ఈకవి గోదావరిని యథేచ్ఛముగ గంగ యని వ్యవహరించి యున్నాఁడు. ఇది ప్రాచ్యలిఖితగ్రంథాలయమునఁ గలదు.)

శ్రీరాముఁడు గోదావరిని శపించి యనుగ్రహించినకథాంశము గల ఘట్టమునందు గంగా పదము గోదావరికిఁ బర్యాయపదముగ మడికిసింగన ప్రయోగించి యున్నాఁడు. చూడుఁడు.

“గంగాప్రవాహంబునుగూర్చి యత్తీర్థస్నాతులకుం బునరావృత్తిలేని విష్ణుపదంబుఁబొందుటకు సంశయింపవల దని గంగాశబరీసంగమస్నానవిశేషంబుఁ జెప్పి మునిగణంబువీడ్కొని గంగ ననూనయించి యచ్చటువాసి చని” (పద్మ - అష్టమాశ్వాసము.)

సీ. “అట్టిమహాగంగ నఖిలహితార్థమై యవని భగీరథుం డనునృపాలుఁ
డును గౌతముం డనుమునియును జనుదెంచి యతినిష్ఠతోఁ దప మాచరించి
నను వేడుకొని గంగఁ గొనిపోయి రుర్వికి గౌతమాన్విత యయ్యెఁ బూత యైన
యమ్మహానదియును నతిపుణ్యమూర్తి యై తనరియు గౌతమి యనఁగఁబరఁగె

తే. గీ. మఱి భగీరథుచేత చేఁబడినగంగ, యల్లభాగీరథీఖ్యాత యయ్యె ధాత్రి
నువిద యిట్టిది గంగాసముద్భవంబు, వింటిగద దీని నాచేత వివిధగతుల.”

పద్మపురాణము - సప్తమాశ్వాసము.

(మడికిసింగన ఓరుగల్లుచెంతనున్న రామగిరిలో నున్నవాఁడు రామగిరి గోదావరీతీరమున నున్నది. నిజాముదేశమున గంగ యని గోదావరిని వ్యవహరించుటఁ బట్టియు సమార్థకము లగుటఁబట్టియు నిటుల వ్రాసియున్నాఁ డనుట నిక్కువము )

సీ. “ప్రహించు నేవీటిపశ్చిమప్రాకార మొరసి గంగమ్మసాగరము కొమ్మ.” కాశీఖండము.

(రాజమహేంద్రపురవర్ణనసందర్భమున)

సీ. “రాపూర్ణచంద్రిక రాగౌతమీగంగ రమ్ము భగీరథరాజతనయ.”

భాగవతము - దశమస్కంధము.

ఇటుల మహాకవు లనేకులు గోదావరిని గంగ యని వ్యవహరించియున్నారు. నిజాము రాష్ట్రవాసులు గోదావరిని గంగ యని వ్యవహరించుట మేము స్వయముగా నెఱింగియున్నారము. పోతరాజు స్నానార్థ మేగినది సమీపమున నున్న గోదావరీతీరమున కనుట నిక్కువము. కాశి కేగియున్నచో నేమహేశ్వరునో ఏవిశ్వేశ్వరునో ధ్యానించియుండునుగదా! ఇంతియగాక

“భాగవతపురాణ పారిజాత పాదపసమాశ్రయంబునను హరికరుణావిశేషంబునను గృతార్థత్వంబు సిద్ధించె నని బుద్ధి నెఱింగి మఱలి కొన్నిదినంబులకు నేకశిలానగరంబునకుఁ జనుదెంచి గురువృద్ధబుధబంధుజనానుజ్ఞాతుండ నై........” భాగ. ప్రథ. 23.

అను సీసవచనముగూడ పోతనామాత్యుని బమ్మెరనివాసమున కనుకూలముగ నున్నది. పోతరాజు కాలమునాఁటికి ఇంచుమించుగ నలువదియేఁబదిసంవత్సరముల క్రింద విద్యాపీఠ మనఁదగు కాకతీయసామ్రాజ్య మస్తమించెను. కాని విద్యావంతులకుఁ గవులకుఁ బండితులకు నేకశిలానగరమున నా కాలమునఁ గఱవు లేకుండెను. అది నగరముగాన మహాజనపూరితమై యుండెను. పోతరాజు గోదావరిస్నానము గావించి మఱలి బమ్మెరకు వచ్చునపుడు ఏకశిలానగరమునకు వచ్చెను. కాలదియాత్రికుడలు నడచిన రెండుమూఁడుదినములలో గోదావరీతీరమునుండి యేకశిలానగరముఁ జేరవచ్చును. మధ్యమార్గవిశ్రాంతిగ విశ్రమించినచు మఱలి మఱికొన్నిదినములకు ఏకశిలానగరంబునకుఁ జేరియుండుననుట యుక్తియుక్తముగనున్నది. ఏకశిలానగరము పోతరాజు కాలమున నపూర్వవైభవోపేతముగ నున్నటుల క్రీడాభిరామమువలనఁ దెలియును. పోతరాజు గంగాస్నానమునకే యేగెనన్నచో పైబాధకములు కాక స్నానాంతరమునఁ గొన్నిదినంబుల కేకశిలానగరమునకుఁ జేరుట సంభవింపదు. పోతరాజు ఒంటిమిట్టనుండి శ్రీశైలప్రాంతమందు గల పాతాళగంగాస్నానమునకుఁ బోయియుండరాదా యని ప్రతిపక్షవాదము కలదుగాని యది నిస్సారమైనది. పోతరాజు కాలమున నొంటిమిట్టకు నేకశిలానగరనామము లేదు. ఆ కాలమున నది యొకనగరమును గాదు. అట్టి ప్రసిద్ధులున్నట్లు తెలియరాదు. అంతకుమున్ను లేని యేకశిలానగరనామము పోతరాజు కల్పింపవలసినయగత్య ముండదు. ఉండెబో యావలివారు దాని నంగీకరించియుండెడివారే! ఈచర్చవలనఁ బోతరాజు గోదావరిస్నాన మాచరించి శ్రీరామసాక్షాత్కారుఁడై గృహాభిముఖుఁడై బమ్మెరకేగుచు నేకశిలానగరమునఁ బెద్దలకుఁ దనసంకల్ప మెఱింగించి యనుజ్ఞాతుఁడై *బమ్మెర చేరిగాని యేకశిలానగరమున నివసించిగాని భాగవతము రచించియుండుననుట సంభావ్యము.

ఏఁబదియఱువదిసంవత్సరముల క్రింద భాగవతపీఠికలో పురాణము హయగ్రీవశాస్త్రులువారు ఒంటిమిట్టయే యేకశిలానగరమని వ్రాసిరి. నాటనుండి యంధపరంపరగ ఒంటిమిట్టను ఏకశిలానగర మని యేఁబదియేండ్లకిటీవలివారే వ్యవహరింపసాగిరి. క్రీ. శ. 1800 లో మెకంజీదొరవారు సేకరించినస్థానికచరిత్రములో (Local Records) గల ఒంటిమిట్టశాసనములలో కైఫీయత్తులలో నేకశిలానగర మనుపే

* బమ్మెరను ప్రకృతము బొమ్మెర యని వ్యవహరించుటఁ జూచి వావిలికొలను సుబ్బరావు పంతులువారు బమ్మెర వేఱు బొమ్మెర వేరను వింతవాదమునకు వచ్చినారు. దత్తమండలవాసు లగు గుత్తి కేశవపిళ్లగారు బొమ్మెర పోతరా జనిరి. క్రీ. శ. 1829 లో కావలి వెంకటస్వామిగారు బొమ్మెన పోతరా జనిరి. ఇంతియగాక గ్రాంథికభాషలో గల "పలువు వలువగను కోరుకు కోరికగను ఉల్ల అల్లగను" మాఱుట మన మెఱింగియే యున్నాము. వ్యవహారభాషలో బమ్మెర బొమ్మెరగా మారెననుట యాశ్చర్యకరముకాదు. ఒంటిమిట్టను వొంటిమిట్ట యనియు వంటిమిట్ట యనియు వ్యవహారము చేసినటుల శాసనాధారములు కలవు. ఒంటిమిట్ట వేఱు తక్కిన వొంటిమిట్ట వంటిమిట్టలు వేఱని యేరేని యనగలరా? వ్యవహారమున నీషద్వ్యత్యస్తము ప్రతిశబ్దము చెందుచు నున్నది.

రెక్కడ కానరాదు ఒంటిమిట్ట యను పేరా గ్రామమునకు 'ఒంటఁడు'-'మిట్టఁడు' అను బోయలవలన వచ్చినటులఁ జెప్పఁబడినది. ఇట్టియెడ ఏకశిలానగర మనుసంస్కృత నామ మెటుల సరిపడుట సంభవింపఁగలదు? క్రీ. శ. 1430 లో నున్న అయ్యలరాజు త్రిపురాంతకుఁడు మొదలుకొని 1800 లో నున్న మెకంజీకి మధ్యగలవా రెవ్వరు ఒంటిమిట్ట నేకశిలానగర మని వ్యవహరింపలేదు. కాఁగా పోఁగా క్రీ. శ. 1849 ప్రాంతమున పురాణం హయగ్రీవశాస్త్రిగారు భాగవతపీఠికలోను, 18[illegible] లో మదరాసు మాన్యుయల్‌లోను, 1906 లో నేకశిలానగరమాహాత్మ్యమునమాత్రమే ఒంటిమిట్ట కేకశిలానగరప్రయోగము కానవచ్చుచున్నది కావున బాగుగా విచారించినఁ బోతరాజు చెప్పిన 'ఏకశిలానగరము' ఓరుగల్లెగాని ఒంటిమిట్ట కాదనియుఁ బోతఁరాజు దత్తమండలవాసి కాఁడనియు స్పష్టపడకపోదు. ఇఁక నీవిషయ మింతతో నాపి పోతరాజువంశజులు వ్రాసిన దాక్షాయణీపరిణయము పరింతము. కేసనమల్లన కవులు దాక్షాయణీపరిణయ మను గ్రంథము వ్రాసి గురుజాల మల్లనసోమయాజి కంకితముగావించి యున్నారు. వీరు బమ్మెరపోతరాజుమనుమ లనుటకు నా గ్రంథములోని యీ క్రిందికవిస్తుతిసాయము కాఁగలదు

చ. "నెఱిగురిగల్లునన్నయమనీషినిఁ దిక్కన శంభుదాసునిన్
బరువడి మత్పితామహుని బమ్మెరపోతన భాస్కరాహ్వయున్
వరకవి సార్వభౌముని నవారితభక్తి నుతింతు మెప్పుదున్
గురుకరుణాఢ్యు లంధ్రకవికుంజరులన్ దగ భూమి శోభిలన్."

కవిస్తుతిచేఁ బోతరాజునకు దాక్షాయణీపరిణయగ్రంథకర్తలు మనుమలని స్పష్టమగుచున్నది. ఈకృతినొందిన గురిజాల మల్లనసోమయాజి గుంటూరుమండలములోని గురిజాలనివాసి కానోపునని కొందరు తలంచిరి. ఇది ప్రమాదము. ఒరంగల్లుజిల్లా పరకాలతాలూకాలో నీగురుజాలయున్నది కవులనివాసస్థానముగూడ నోరంగల్లు ప్రాంతమే. కృతిపతికవులనుగూర్చి చెప్పుభాగమునఁ గలయీపద్యము చూడుఁడు.

సీ. "శ్రీరామలింగాంఘ్రిసేవావరప్రౌఢకవితాచమత్కృతిఁ గాంచువారి
నప్పలమ్మయును వీరాంబయుఁ బ్రౌఢసరస్వతికిని గన్నప్రజ్ఞవారి
కౌండిన్యగోత్రవిఖ్యాతి బమ్మెరభవ్యవంశాఢ్యులై సిరి వఱలు వారి
ఇవటూరుముక్తినాగేశసద్గురుభక్తి నాదిమశైవులైనట్టివారి
తే. గీ. కేసకవిమల్లకవినామకీర్తిపరుల, మమ్ము పిలిపించి మన్నించి మదిఁ దలంచి
ఘనత నుచితాసనంబుల నునిచి వేడ్క, వినయనయవాక్యములచేత నెనయఁ బల్కి."

ఈపద్యముబట్టిచూడఁ బోతనామాత్యునివంశజులు ఇవటూరియారాధ్యులవారినే గురువులుగ భావించినటులఁ దెలియుచున్నది. కృతికర్త మల్లనసోమయాజి వాసమగు గురిజాల నిజామురాష్ట్రమునందుంటచేతను కేసనమల్లనలు పోతరాజువలెనే శైవాచారప్రవిష్టులై ఇవటూరుఆరాధ్యులవారిశిష్యు లగుటవలనను వీరందఱు ఒరంగల్లుప్రాంతములవా రని విశ్వసింప వీలగుచున్నది. ఏవిధముగ నాలో

చించినను బోతరాజు నతనివంశీయులు వారిసంబంధులు ఒరంగల్లునకు సమీపము లోనివారని స్పష్ట మగుచున్నది.

## పోతరాజుబాల్యావస్థ—వీరభద్రవిజయము.

ఇక్కడి రాజువంశజులందఱు వీరశైవమత ప్రవిష్టులై యుండిరి. ఆకాలమునఁ గాకతీయప్రథమప్రతాపరుద్రచక్రవర్తియవలంబనము నూఁతఁ గొని పాలకురికి సోమనాథకవి వీరశైవమతప్రచారము మిక్కుటముగాఁ గావించెను. రాజు లందఱు వీరశైవులైరి. బసవేశ్వరునిపిమ్మట నీమతమునకు వ్యాప్తిఁ దెచ్చిన దీ సోమనాథకవియే. ఇతఁడు పోతనగ్రాసగ్రామి యని చెప్పఁబడుబమ్మెరకు మూఁడు మైళ్లలో నున్నపాలకుర్తినివాసము కలవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. "ఉత్తమ రాజు" అను నింటిపేరుగల కౌండిన్యసగోత్రుఁ డనియు శిఖాయజ్ఞోపవీతాదులు ద్యజించి సర్వసమతబోధించు వీరశైవమతముఁ బ్రవేశించి దాని నుద్ధరించె నని వినుచున్నారము. సోమనాథుఁడు పాలకుర్తినివాసి యనుటకు గ్రంథస్థము లగు నాధారములుకూడఁ గలవు.

సీ. "భవదీయసంబంధబంధురం బయ్యె నేభాగ్యంబుఁ జేసెనో పాలకురితి
భవదంఘ్రిపూజనాపరుల కిమ్మయ్యె నేభాగ్యంబుఁ జేసెనో పాలకురితి
యుష్మద్విహారసంయుక్తమై మించె నేభాగ్యంబుఁ జేసెనో పాలకురిని
యుష్మదీయాశ్రమాత్యున్నతిఁ గాంచె నేభాగ్యంబుఁ జేసెనో పాలకురితి
ఆ. వె. పాలకురితి యేమిభాగ్యంబుఁ జేసెనో, నీస్వనామపూర్వనిహిత మయ్యె
ఈహితానుషంగ యేకామ్రగురుచిత్త, నలినభృంగ సోమనాథలింగ."

అన్యవాదకోలాహలము.

"అచట శివభక్తులు సిగ్గుపడి పాలకుర్తికేఁ జని సోమనాథుని కెఱింగించిన ఆసోమనాథుండు శైవులు కానివారలఁ జూడకుండుటఁ జేసి ఒక్కశకటంబుగుడారంబుఁ బన్నించి."

ప్రతాపచరిత్రము.

ఈమహాకవి పాలకుర్తిలోనే సిద్ధినొందెను. అట నొకయాలయమును దత్రత్యులు కట్టి యొకలింగమునుస్థాపించి సోమనాథుని దైవముగ నాఁటినుండి నేఁటి వఱకుఁ బూజించుచు నుత్సవాదులు గడపుచున్నారు. పోతరాజుగూడ నాసోమనాథునిభక్తుఁడైనటుల నీక్రిందికీర్తనవలనఁ దెలియనగును.

"పాలకుర్తిసోమలింగా నీపాదములకు శరణూ, ఉరవుగ బమ్మెరపోతరాజునకు నీవు కోరినవరములు కృపఁ జేసినావట ॥పాల॥"

ఈకీర్తన నిజాముకరాష్ట్రములోని పాలకుర్తియుత్సవములలో జనసామాన్యము సోమనాథునిగూర్చి పాడునది దీనిబట్టిచూచినను భాగవతమునఁ గల పోతరాజు జనకుఁ డగు కేసనామాత్యునిఁ బ్రశంసించుఘట్టమునఁ గల

"......కేసన, దానమానకీర్తిధనుఁడు ఘనుఁడు
తనకు లక్కమాంబ ధర్మగేహినిగాఁగ, మనియె శైవశాస్త్రమహిమ గనియె."

ఈ పద్యభాగమువలనఁ బోతరాజుజనకుఁడు శైవమతాభిమాని యనియుఁ బైకీర్తనమువలనఁ బోతరాజు సోమనాథమహాకవిభక్తుఁ డనియుఁ దెలియును. పోతరాజు బాల్యావస్థలో నంతకు రెండుమూఁడువందలసంవత్సరముల క్రింద గతించినసోమనాథుఁడు దైవముగా భావింపఁబడుచుండె ననుట వింత కాదు. ఇంతకుఁ జెప్పునదేమనఁ బోతరాజు బాల్యమున వీరశైవమతాభిమాని యై యుండె ననియే. ఆస్థితిలో వ్రాసినదే వీరభద్రవిజయము. ఈగ్రంథము పోతనకృతము కా దనునొకప్రవాదము కలదు. మేముగూడ నీవిషయము నిర్ణయించువారిలో నొకరమే గాని వీరభద్రవిజయము పఠించి పూర్వాభిప్రాయమును మార్చికొనఁ గలిగితిమి.

ఉ. "భాగవతప్రబంధ మతిభాసురతన్ రచియించి దక్షకృ
ద్యాగకథావిధానమున నల్పవచస్కుఁడ నైతి తన్నిమి
త్తాగమవక్త్రదోషపరిహారతకై యజనైకశైవశా
స్త్రాగమవీరభద్రవిజయంబు రచించెద వేడ్కతోడుతన్."

అనువీరభద్రవిజయములోనిపద్యముఁ జూచిన యప్రౌఢముగ నున్నవీరభద్రవిజయము భాగవతమున కావల రచింపఁబడినగ్రంథము కాదనియు దాని నితరులు రచించిరనియు స్థూలదృష్టికిఁ దోఁచును కానిదూరమాలోచించినచోఁ "బై పద్యము వీరభద్రవిజయలిఖితప్రతులలోఁ గానరాదు. ఆంధ్రసాహిత్యపరిషత్తులోఁ గల తాళపత్రగ్రంథములలోని వీరభద్రవిజయప్రతులందు ఆంధ్రపరిశోధకమహామండలిలోని లిఖితప్రతులయందు నీపద్యము లేదని విని యున్నారము. పోతరాజు వీరశైవమతమువదలి సర్వాద్వైతసమత్వము బోధించు నద్వైతములో నభినివేశము నార్జించి భాగవతము తెలిగించినపిమ్మట నెవరో యీపద్యమును బ్రక్షిప్తము గావించి యుందురు. వీరభద్రవిజయము పగులు కల్పించి పోతరాజునకుఁ గర్తృత నారోపింపఁబడినగ్రంథ మెప్పటికిఁ గాదు. అటుల నితరులు గావింపవలసినప్రసక్తియు లేదు. రచించినయితరులెవరో తెలియనపుడు రచింపఁదగినప్రసక్తి తెలుపుపద్యము ప్రక్షిప్తమని తేలినపుడు వీరభద్రవిజయము సవిమర్శదృష్టితోఁ బరిశీలింపక పరులు రచించి రనుట సాహసము.

వీరభద్రవిజయగ్రంథరచనప్రేరకుఁడు ఇవటూరు సోమనాథారాధ్యులవారు ఈయన సర్వవిద్యాపారంగతుఁడు. సర్వశాస్త్రవిదుఁడు. ఒక్కనాఁ డీయారాధ్యులు పోతయను జూచి యిట్లు పలికెను.

ఆ. వె. "పిన్నవాఁడ ననియుఁ బెక్కుసంస్కృతులను, విననివాఁడ ననియు వెఱపుమాని
మత్ప్రసాదదివ్యమహిమచే నెంతైన, కవిత చెప్ప లావు కలదు నీకు." 20

వ. "అదియునుంగాక నీకు వీరభద్రేశ్వరప్రసాదంబు గలదు గావున వాయుపురాణసారంబగు
నీకథావృత్తాంతం బంతయుఁ దెలుంగున రచింపు మని యాన తిచ్చె మద్గురునిమధుర
వాక్యంబులకు నత్యంతానురాగసంతుష్టుండ నై......" 21

దీనిచేఁ బోతరాజు మిగులబాల్యావస్థలోఁ గవిత రచింపసాగె ననియు నపుడువంశపరంపరాగతదేశికుఁ డగుఇవటూరిసోమనాథారాధ్యులవారు వీరభద్ర విజయము రచింపఁ బ్రేరేపించెననియు నతఁడు గురుకులవాస మొనరించి విద్య నభ్యసించినవాఁడు కాఁడు కావునను నంతకుమున్ను శైవుఁ డైనకతనను దనకవిత్వము శైవాచార్యానుగ్రహలబ్ధమనియు దాను ఇవటూరి సోమనాథదేవదివ్య శ్రీపాదపద్మారాధకుఁడననియు వీరభద్రప్రసాదము కలవాఁడ నని చెప్పికొనెను. బాల్యమునఁ గవిత వ్రాయదొరకొనుటచే నమాత్యాదివిశేషణము లుపయోగించి కొన మాని పోతయనామముమాత్ర ముపయోగించెను. వీరభద్రవిజయమును బట్టి పరిశీలించినను బోతరాజు గురుసన్నిధి విద్యఁ బఠించినవాఁడు కాఁ డనియు దైవప్రసాదము కలవాఁడనియు బాలకవి యనియుఁ దెలుసు. కవి స్తుతిలోఁ గూడ "నన్నయభట్టు, తిక్కనసోమయాజి, రంగనాథుఁడు, వేములవాడ భీముఁడు" అనువారినే స్మరించెను. వీరభద్రవిజయములోనివంశవర్ణనము భాగవతవంశవర్ణనము సరిపోవుచున్నది కాన భాగవతమున గవివంశవర్ణనము స్వీకరింపఁబడినది. దీనిని బట్టిచూచినను వీరభద్రవిజయము పోతరాజుబాల్యగ్రంథ మనుటకు మాకెట్టిసంశయము లేదు. పాలకుర్తి సోమనాథకవిస్థాపించిన వీరశైవపీఠస్థలములలో ఇవటూ రొకపీఠస్థలము. ఇందు బోధకులుగావచ్చువారలు సోమనాథనామము వహించుట సాజము. ఇది బమ్మెర ఒరంగల్లులకుఁ గొలఁది యామడలదూరమున నున్నటులఁ దెలియును గాన సోమనారాధ్యపోతరాజులకుఁ గలసంబంధముగూడ విశ్వాసయోగ్యంబు. పాలకుర్తి సోమనాథుఁడు శైవపీఠములు స్థాపించినయంశము విమర్శింప నెంచుచో పిడుపర్తి సోమనాథుని బసవపురాణపద్యకావ్యములోని కృత్యాదిపఠించిన స్పష్టము కాఁగలదు. ఇటులే పిడుపర్తిసోమనాథుఁడు పిడుపర్తిలోనిశైవపీఠమున కధ్యక్షుఁడు. ఇట్టిపీఠము ఒరంగల్లు మెదకుబీదరుమండలములలోఁ బెక్కులు కలవు.

వీరభద్రవిజయంబు ప్రథమగ్రంథమని యాగ్రంథమునఁ జెప్పఁబడియుంట గాక ధారాలోపము భావలోపములు వ్యాకరణదోషములు గూడ నావిషయమును నిర్ధారణము గావించుచున్నవి, కాని భాగవతమహావృక్షమునకు వీరభద్ర విజయ మంకుర మనఁదగినపోలికలు మాత్రము లేకపోలేదు. చూడుఁడు.

సీ. "వీణయుం నీవుదే వీణావినోదిని మృగనాభి నీవుదే మృగనిభాక్షి." వీరభద్రవిజయము.

సీ. "పున్నాగ కానవే పున్నాగవందితుఁ దిలకంబ కానవే తిలకనిటలు." భాగవతము.

సీ. "శృంగారములు చేయుఁ శృంగార మొల్లదు పూవులు దురుమదు పువ్వుఁబోఁడి
పరికింప నేరదు పలుక నేరదు భ్రాంతి చంచలత్వము గాంచు జంచలాక్షి
సరసుల క్రీడింప సరసిజానన పోదు మానంబు లోఁగొందు మానవిభవ
గంధంబు పూయదు గంధవారణయాన చెలియల పిలువదు చెలులచెలియ
తే. గీ. ముకుర మొప్పగఁ జూడదు ముకురయాన, తరుణి మఱియును సర్వకృత్యములు మఱచి
హరునితోడుత కొండాట మైలతాంగి, యుగ్రతపమును నైరింపకున్నఁ జూచి."

వీరభద్రవిజయము.

